# సోవియట్ సమీక్ష

## గోర్బచేవ్
## భారత సందర్శన పత్రాలు

1988
సోవియట్ భూమి
నెహ్రూ బహుమతులు

ప్రపంచ
సమస్యలు :
మానవీయ
వైఖరి

సోవియట్ పత్రికలనుంచి
సంక్షిప్త సమాచారాలు

1 1989

# సంబంధాలు



మాస్కోలో జపానీయుల టీ పార్టీ. సోవియట్ సంస్కృతిశాఖ మంత్రి వి.జి. జహరవ్ ఆయన సతీమణి, కుమార్తె దీనిలో అతిథులు. జపాన్ ఉరసోన్సెనిధి ప్రతినిధివర్గం తమ సాంప్రదాయిక, ఆతిథ్య మిస్తోంది.



మాస్కో క్రీడా సదనంలో మంచి మీద నృత్యం ఒలింపిక్ ఛాంపియన్‌లు జేన్ తోర్విల్, క్రిస్టఫర్ డీన్‌లు మధ్యలో వున్నారు. వసూలైన నిధిని మాస్కోలో ఒక కెథెడ్రల్ పునరుద్ధరణ కోసం పంపిస్తారు.



మాస్కోలోని జాతీయ మ్యూజియం అసోసియేషన్‌లో బరోన్‌హాన్స్ హీన్‌రిచ్ థిస్సెన్-బోర్నెమిస్సా చిత్రాల ప్రదర్శన. థిస్సెన్ బోర్నెమిస్సా ఫోటో మధ్యలో వున్నారు.



ప్రియమైన
పాఠకులందరికీ
నూతన సంవత్సర
శుభాకాంక్షలు



# ఈ సంచికలో





**30**



**60**

పెంజికేంత్‌లో పురావస్తు తవ్వకాలలో సంచలనాత్మకమైన సమాచారం వెల్లడైంది. మధ్య ఆసియా ప్రాంతాల చరిత్ర గురించి కొత్తవాస్తవాలు వెల్లడయ్యాయి.

సోవియట్ భూమి నెహ్రూ బహుమతులు
ఇవి భారతసోవియట్
సాంస్కృతికసంబంధాలలో
ముఖ్యమైన మైలు
రాళ్ళయినాయి.

19



3



మిహయాల్ కొజకోవ్
బాధాతప్త అనుభవంతో
సత్యసాధన

57

భారత సోవియట్ నాయకుల మధ్య క్రమబద్ధంగా శిఖరాగ్రస్థాయిలో జరిగే సమావేశాలు రెండు దేశాల ద్వైపాక్షిక సంబంధాల్లోనే గాక అంతర్జాతీయ వ్యవహారాలలో కూడా ముఖ్యమైన మైలు రాళ్ళుగా నిలుస్తున్నాయి. మిహాయిల్ గొర్బచేవ్, భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీల మధ్య జరిగే ప్రతీ సమావేశమూ రెండు దేశాల సహకారాన్ని మరింత విస్తృతపర్చి మరిన్ని రంగాలకు విస్తరింపచేయడానికి, అలాగే అంతర్జాతీయ సమస్యలకు పరిష్కారాన్ని కనుగొనడానికి, అణ్వస్త్రరహిత హింసారహిత ప్రపంచ స్థాపనకు హామీ కల్పించడానికీ ఒక కొత్త పూవును యిస్తున్నాయి.

ప్రపంచశాంతి, దేశాల మధ్యమైత్రి ఆశయానికి మహాయోధుడైన జవహర్లాల్ నెహ్రూ స్మారకార్థం 1964 లో నెలకొల్పిన సోవియట్ భూమి నెహ్రూ బహుమతులు భారతదేశంలో అందరూ ఎంతో ఆసక్తితో ఎదురుచూసే సాంస్కృతిక ఘటనగా రూపొందాయి. జవహర్లాల్ నెహ్రూఎంతో ప్రియంగా భావించిన ఆశయాలకు దోహదం చేసే లక్ష్యంతో సాహిత్య, జర్నలిజం, కళా రంగాలకు చేసిన శ్లాఘనీయమైన కృషికిగుర్తింపుతో ప్రతిసంవత్సరం యీ బహుమతులు యివ్వడం జరుగుతోంది.

సోవియట్ యూనియన్ దేశాయాంగ, విదేశాంగ విధానాల్లో నిర్ణయాత్మకమైన మార్పులు తెచ్చి మూడున్నర సంవత్సరాలైనాయి. పెరిస్త్రోయిక నిజ ఫలితాలు యిప్పటికీ గణనీయ మైనవిగా లేవు. సంస్కృతి, మేధా రంగాలలో మాత్రం అని స్పష్టంగా ద్యోతకమౌతున్నాయి. ప్రజాస్వామ్యంతొలి అంకురాలు వెలికి వస్తున్నాయి. అయితే పెరిస్త్రోయిక నుంచి నిజమైన ప్రయోజనాలు యిప్పటికి ప్రజల అనుభవానికి రాలేదు.

అధికారంలోని ఉన్నత స్థాయిలవారికి యీ ఎరుకవుంది. "అత్యంత క్లిష్టమైన రోజులు వచ్చాయి" అనిమిహాయిల్ గొర్బచేవ్ అంగీకరించారు.

ఇక్కడోమాట చెప్పాలి సహనంతో వుండాల్సిన అవసరాన్ని గురించి ప్రజలకు నచ్చచెప్పి క్రమేపీ వారిని సిద్ధపర్చడానికీ, భావనలో విప్లవకరమైన పెరిస్త్రోయికా క్రమం ఫలితాల నివ్వడంలో క్రమాభివృద్ధిగా వుంటుందని ప్రజలు అవగాహన పర్చుకునేట్టు చేయడానికీ కృషి ఆరంబమైంది.

సంస్కరణల అమలు వేగంపట్ల దాని ఆర్థిక ఫలితాలపట్ల సమాజంలో ఆశాబంగ భావన ఎవరికైనా కనిపిస్తుంది; పునర్నవ విధానానికి ముప్పు కల్పించే వాణులు తరచు వినిపిస్తూనే వున్నాయి. పెరిస్త్రోయికాకు ఆటుపోటులు ఎదురవుతున్నప్పటికి దానికి "విశ్వాస మూలబలగాలు" ప్రజలలో అపారంగా వున్నాయని ప్రజల మనో భావాలు ముఖ్యంగా కార్మికవర్గ మనోభావాలు రుజువుపరుస్తున్నాయి.

పెరిస్త్రోయిక, గ్లాస్‌నస్త్, "మార్కెట్" పద్ధతికి తిరిగిరావడం, "కిందనుంచి" ప్రజాతంత్ర చొరవల కెరటాలు మొదలైనవాటివల్ల ఉద్భవించిన కొత్త సమస్యల మంచు చెరియల పతనాలను తట్టుకుని నిలువలేనివారిలో "భయకంపితం" కావడం, "తిరిగి లుమ్మ చుట్టుకు" పోవడం, వంటి మనోభావ సూచనలు కనబడుతున్నాయి. మొత్తం దేశజనాభా అంతటిలోనూ పెరిస్త్రోయికా క్రమంపట్ల పూర్తి శ్రద్ధాసక్తులు వున్నాయి. అది తప్పక విజయవంతమవుతుందని గొప్ప నమ్మకం వుంది. దేశంలో ఒక కొత్త విధానానికి అఖండ భావనను రూపొందించడం జరిగిందని ప్రజలు అర్థంచేసుకోవడం, 1921 లో లెనిన్ ఆరంభించిన నూతన ఆర్థిక విధానం (ఎన్ఇపి) తరవాత బహుశాయిదే మొదటిసారి కావచ్చు. ఇక నుంచి ఆర్థిక సామాజిక వ్యవహారాలను నిరంకుశ ఆజ్ఞలు, నాయకుల యిష్టాలు, "అందుకొని - పరుగెత్తి - దాటిపోండి" నినాదాల ఉద్యమాలతో గాక దేశంలో తిరిగి గౌరవస్థానంపొందిన ఆర్థిక నియమాల తిరుగులేని తర్కం ఆధారంగా నిర్ణయించడం జరుగుతుందని ప్రజలు అర్థంచేసుకుంటున్నారు. ఈ విధానం పట్ల ప్రజలకు నమ్మకంవుంది

# సోవియట్—భారత పత్రాలపై సంతకాలు



1988 నవంబరు 20 న న్యూఢిల్లీలో అనేక సోవియట్-భారత్ పత్రాలపై సంతకాలు జరిగాయి.

సోవియట్ కమ్యూనిస్టుపార్టి కేంద్రకమిటీ ప్రధానకార్యదర్శి, యుఎస్ ఎస్ ఆర్ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ అధ్యక్షులూ అయిన మిహయిల్ గోర్బచేవ్, భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీలు సోవియట్ భారత శిఖరాగ్ర ప్రకటనపై సంతకాలు చేశారు. భారతదేశంలో ఒక అణువిద్యుత్ కేంద్ర నిర్మాణంలో సహకారాన్ని గురించిన ఒక ఒప్పందంపై కూడ వారు సంతకాలు చేశారు.

శాంతియుత ప్రయోజనాల కోసం దూరరోదసి అన్వేషణ, వినియోగంలో దీర్ఘ కాలిక సహకారాన్ని గురించిన ఒక ఒప్పందంపై సోవియట్ విదేశాంగమంత్రి ఎద్వార్డ్ షెవర్డ్ నాద్జె, భారత విదేశాంగమంత్రి శ్రీ నరసింహారావు సంతకాలు చేశారు.

వింధ్యాచల్ థర్మల్ విద్యుత్ కేంద్రం రెండవ దశ నిర్మాణంలో సహకారం గురించిన ఒక ఒప్పందంపై సోవియట్ మంత్రిమండలి డిప్యూటీ ఛైర్మన్ వ్లదీమిర్ కామెంత్సెవ్, భారత ఆర్థిక మంత్రి శ్రీ ఎస్.బి. చవాన్‌లు సంతకాలు చేశారు.

సంతకాలు చేసిన యితర పత్రాల్లో, డబుల్ పన్ను విధింపును తప్పించడంపై ఒప్పందం, విద్యుత్ పరిశ్రమ సౌకర్యాల నిర్మాణంలో ఆర్థిక, సాంకేతిజ్ఞత సహకారాలపై ఖరారునామా తదితరాలున్నాయి.

# సోవియట్-భారత శిఖరాగ్ర ప్రకటన

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి, సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ అధ్యక్షుడు అయిన మిహాయిల్ గోర్బచేవ్, భారత ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీలు 1988 నవంబర్ 20 న న్యూఢిల్లీలో సంతకాలు చేసిన సోవియట్-భారత శిఖరాగ్ర సమావేశ ప్రకటన పూర్తి పాఠాన్ని యీ కింద పొందుపరుస్తున్నాం.

ఢిల్లీ ప్రకటనలో పొందుపర్చినట్టి నూతన రాజకీయ ఆలోచనా ధోరణి సూత్రాలు ప్రపంచమంతటా నానాటికీ విస్తృత ప్రతిస్పందన కలిగించాయని సోవియట్ యూనియన్, భారత రిపబ్లిక్‌లు ప్రగాఢ సంతృప్తి వ్యక్తం చేశాయి. అణు, రోదసీయుగంలో మనుగడ, ప్రగతుల తాత్వికతకు సంబంధించిన మౌలిక భావాలు ఢిల్లీ ప్రకటనలో వున్నాయి; యిది ప్రపంచంలోని సార్వత్రిక రాజకీయ వాతావరణాన్ని సానుకూలంగా ప్రభావితం చేస్తోంది; అంతర్జాతీయ సంబంధాలను మరింత మెరుగ్గా రూపొందించేందుకు ప్రేరణనిస్తోంది. యిది ప్రపంచ వ్యాప్త సమస్యలపై ఉభయదేశాల ఉమ్మడి అవగాహనలను మానవాళి భవితవ్యం పట్ల వాటి ఉమ్మడి దృక్పథాన్ని ప్రతిబింబిస్తోంది.

మరింత సురక్షితమైన, మరింత న్యాయమైన ప్రపంచం అనే నూతన భావన రాజకీయ సంకల్పం వున్నట్లయితే సార్వత్రిక అంగీకారాన్ని పొందగలదని గత రెండేళ్ల ఘటనలు రుజువు పర్చాయి. ఐఎన్ఎఫ్ సంధిపై సంతకాలు జరగడం; ఆఫ్ఘనిస్తాన్ గురించిన జెనీవా ఒప్పందాలు; ఇరాన్-ఇరాక్ యుద్ధంలో కాల్పుల విరమణ; ఆగ్నేయాసియా, నైరుతి ఆఫ్రికా, ప్రపంచంలో యితర ప్రాంతాలలోని ఘర్షణల పరిష్కారం దిశగా సానుకూల చర్యలు - యివి ఢిల్లీ ప్రకటనకుగల కాలోచితత్వాన్నీ జీవశక్తినీ ధ్రువీకరిస్తున్నాయి.

● ● ●

ఈనాటి పరస్పరాధారిత ప్రపంచం మానవాళికి ఉమ్మడి ఆవాసమనీ, దీని వనరులను వినియోగించుకోడానికి ప్రతి ఒక్క వ్యక్తికీ సమానమైన హక్కుందనీ సోవియట్ యూనియన్ భారతదేశాలు భావిస్తున్నాయి. అంతర్జాతీయ భద్రత కోసం ఒక సమగ్ర ప్రపంచ వ్యవస్థను అభివృద్ధిపర్చేందుకై అన్నిరాజ్యాలూ కృషి చేయడానికిగల ప్రాముఖ్యాన్ని గురించి అవి నొక్కి చెప్తున్నాయి.

అణ్వస్త్రరహిత, హింసారహిత ప్రపంచాన్ని నిర్మించి, నిలబెట్టడంకోసం సిద్ధాంతాల్లో రాజకీయాల్లో సంస్థలలో మార్పు అవసరమనీ ఢిల్లీ ప్రకటనలో ఉద్ఘాటించిన అంతర్జాతీయ సంబంధాలపట్ల నూతన వైఖరి దీనిని నిర్దేశిస్తున్నదనీ ఉభయపక్షాలూ భావిస్తున్నాయి. యిందుకు అంతర్జాతీయ సంబంధాల నిస్సైనికీకరణ, ప్రజాతంత్రీకరణ, మానవీకరణ అవసరం. సైనికవాదం, బలప్రయోగ రాజకీయాలు, ప్రపంచం సైనిక కూటాలుగా విభజన అనేవి అనుమానాన్నీ, శత్రుత్వాన్నీ సృష్టించాయి; వీటిని విసర్జించాలి. జాతీయ సరిహద్దులకు వెలుపల సైనిక స్థావరాలుగానీ, సదుపాయాలుగానీ వుండరాదు.

నిరాయుధీకరణ, ముఖ్యంగా అణ్వస్త్ర నిరాయుధీకరణ యీనాడు సకల దేశాలకు, దేశాల ప్రజలకు సంబంధించిన ప్రధాన సమస్య అని ఉభయపక్షాలూ భావిస్తున్నాయి.

యీ రంగంలో యిటీవల ఉత్పన్నమైన ఉధృతిని కాపాడుకుని, మరింత పటిష్టంచేసు కోవాలి అణ్వస్త్ర పరీక్షలను తక్షణమే ఆపుచేసి, నిషేధించేందుకూ, దూర రోదసిలో ఆయుధ పోటీని నిరోధించేందుకూ, వ్యూహాత్మక అణ్వా యుధాల్లో 50 శాతం తగ్గింపు గురించి ఒప్పందం కుదుర్చుకునేందుకూ, ఆయుధాల న్నిటినీ నిర్మూలించే దిశగా పురోగమించేందుకూ, సైనిక శక్తి స్తోమతలలో కొత్తగా తలెత్తుతున్న సాంకేతిక పద్ధతులపై అంతర్జాతీయ నియంత్రణను నెలకొల్పేందుకూ వెంటనే చర్యలు తీసుకోవాలి. అణ్వస్త్ర ప్రయోగాన్నీ ప్రయోగిస్తామనే బెదిరింపులనూ నిషేధించే ఒక అంతర్జాతీయ ఒడంబడికను, బైనరీ ఆయుధాలతోసహా రసాయనిక ఆయుధాల సమగ్ర నిషేధం, వాటిని ధ్వంసం చేయడం గురించిన ప్రపంచవ్యాప్త ఒడంబడికను తక్షణమే కుదుర్చుకోవాలి

అణ్వాయుధాలుగల రాజ్యాలన్నీ అణ్వస్త్ర నిరాయుధీకరణ క్రమంలో పాల్గొనాలని సోవియట్ యూనియన్, భారతదేశం భావిస్తు న్నాయి. క్రీ.శ. 2000 వ సంవత్సరంనాటికి అణ్వాయుధాలను సంపూర్ణంగా నిర్మూ లించేందుకు రూపొందించిన సోవియట్ కార్య క్రమమూ, క్రీ.శ. 2010వ. సంవత్సరం నాటికి అణ్వస్త్రరహిత, హింసారహిత ప్రపంచ వ్యవస్థను ప్రవేశపెట్టేందుకు భారతదేశం రూపొందించిన కార్యాచరణ పథకమూ, ప్రపంచ కుటుంబానికి సమర్పించిన వివరణాత్మకమైన స్థూలరేఖా చిత్రాలు. నిరాయుధీకరణ క్రమంలో బహుళ పక్ష వేదికల పాత్ర పెరగాలనీ, యిందుకు ఒకే సమగ్ర బహుళపక్ష అజమాయిషీ వ్యవస్థ రూపొందాలనీ ఉభయపక్షాలూ కోరుతున్నాయి.

అఫ్గనిస్తాన్ గురించిన జెనివా ఒప్పందా లకు సోవియట్ యూనియన్, భారతదేశాలు తమ మద్దతును పునరుద్ఘాటిస్తున్నాయి; సంబంధిత పక్షాలన్నిటికీ వాటిని కచ్చితంగా, చిత్తశుద్ధితో అమలుజరపాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాయి. ఒప్పందాలను ఉల్లంఘిస్తూ, కొన్ని శక్తులు అనుసరిస్తున్న అవరోధ విధానంపట్ల ఉభయదేశాలూ విచారం వెలిబు చ్చుతున్నాయి. ఆఫ్గనిస్తాన్‌లో కొనసాగుతున్న రక్తపాతం పట్ల అవి ఆందోళన వ్యక్తంచేస్తున్నా యి; జాతీయ సఖ్యతా విధాన క్రమాన్ని ప్రోత్స హించాలని ఉద్ఘాటిస్తున్నాయి. విస్తృత ప్రాతి పదికగల ప్రభుత్వాన్ని నెలకొల్పడంకోసం ఆఫ్ఘ న్‌లమధ్య సంభాషణలు జరపాల్సిన ఆవశ్య కతను నొక్కిచెప్తూ, ఆఫ్ఘనిస్తాన్ గురించి ఐక్య రాజ్యసమితి సర్వప్రతినిధిసభ తీర్మానం ఐ.రా.స. ప్రధానకార్యదర్శికిచ్చిన ఆదేశాన్ని జాప్యంలేకుండా అమలు జరపాల్సిందిగా సోవియట్ యూనియన్, భారతదేశాలు ఆయనకు విజ్ఞప్తిచేస్తున్నాయి. ఆఫ్ఘనిస్తాన్‌లో అలాంటి ప్రభుత్వాన్ని యేర్పాటు చేసుకోవడం అనేది పూర్తిగా ఆఫ్గన్ ప్రజలు సొంతంగా నిర్ణయించుకోవాల్సిన వ్యవహారం. ఆఫ్గనిస్తాన్ సార్వభౌమాధికార ప్రాదేశిక సమగ్రత స్వతంత్రం, అలీన స్వభావం — వీటి పరి రక్షణ ఆఫ్గన్ సమస్య పరిష్కారానికి కీలకమైన అంశం. యిందుకు ఐ.రా.స. తోడ్పాటుతో అంతర్జాతీయ సమావేశం జరపడం అవసరం.

పశ్చిమ ఆసియా ప్రాంతంలో ఆయుధ పోటీ పెరగడంద్వారా తీవ్ర పరిస్థితి యేర్పడ్డం పట్ల సోవియట్ యూనియన్, భారతదేశాలు ఆందోళన వ్యక్తంచేస్తున్నాయి. పాలెస్తీనా నాయకత్వం కనబర్చిన వాస్తవిక, బాధ్యతా యుత దృష్టిని ఉభయపక్షాలూ హర్షిస్తున్నాయి. న్యాయమైన, సమగ్రమైన పశ్చిమ ఆసియా పరిష్కార పరిధిలో ఒక స్వతంత్ర పాలెస్తీనా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయడం గురించి పాలెస్తీనా జాతీయ సమితి తీసుకున్న నిర్ణయా న్ని అవి బలపరుస్తున్నాయి. సమానప్రాయిలో సంబంధిత పక్షాలన్నిటి భాగస్వామ్యంతో మధ్య ప్రాచ్యం గురించి ఐ.రా.స. ఆధ్వర్యాన జరగ బోయే అంతర్జాతీయ సమావేశానికి సన్నాహక కృషికి త్వరగా ప్రారంభించాలని చేసిన విజ్ఞ ప్తిని అవి పునరుద్ఘాటించాయి.

ఐ.రా.స. ఆధ్వర్యాన ఇరాన్-ఇరాక్ మధ్య కాల్పుల విరమణపట్ల సంతృప్తినీ, అది రెండు

దేశాలమధ్యా న్యాయమైన సుస్థిరమైన శాంతిని నెలకొల్పగలదనే ఆశాభావాన్నీ సోవియట్ యూనియన్, భారతదేశాలు వ్యక్తంచేస్తున్నాయి.

కంపూచియాకు సంబంధించి దాని శాంతి యుత సార్వభౌమాధికార, స్వతంత్ర, అలీన ప్రతిపత్తికి హామీ కల్పిస్తూనూ ప్రజలను వూచకోత కోసే ప్రభుత్వం అక్కడ తిరిగి ఏర్పడే ప్రమాదం లేకుండానూ, అక్కడ రాజకీయ పరిష్కారాన్ని సాధించేందుకు తమ కృషిని ఉధృతం చేయాల్సిందిగా సంబంధిత పక్షాలన్నిటికీ ఉభయపక్షాలు విజ్ఞప్తిచేస్తున్నాయి. జకార్తా అనియత సమావేశ క్రమాన్ని అలీనోద్యమ పరిధిలో చేపట్టిన చొరవను యిటీవల పారిస్‌లో మళ్లీ ప్రారంభించిన సంభాషణను హర్షిస్తున్నాయి; యివి శీఘ్ర పరిష్కారానికి దారితీయ గలవని ఆశిస్తున్నాయి.

కొరియా ద్వీపకల్పంలో ఉద్రిక్తత తగ్గడం ఆసియాలో పరిస్థితి మెరుగుపడేందుకు గొప్ప దోహదం కాగలదని ఉభయపక్షాలూ భావిస్తున్నాయి. యావన్మంది కొరియా ప్రజల ప్రయోజనం దృష్ట్యా ఒక విస్తృత నిర్మాణాత్మక సంభాషణను పెంపొందించడాన్ని అవి సమర్థిస్తున్నాయి.

హిందూమహాసముద్రాన్ని శాంతిమండలంగా రూపుదిద్దే విషయమై 1971 లో ఐ.రా.స.చేసిన ప్రకటనలో పొందుపర్చిన లక్ష్యాలను సాధించేందుకు తమ కృషిని కొనసాగించాలనే దృఢనిశ్చయాన్ని సోవియట్ యూనియన్, భారతదేశాలు పునరుద్ఘాటిస్తున్నాయి. హిందూమహాసముద్రంలో విదేశీ సైనిక స్థావరాలన్నిటినీ నిర్మూలించాలనీ, కొత్త వాటిని యేర్పరచకుండా నిరోధించాలనీ, విదేశీ సైనిక వునికిని పెంచడానికి జరిగే ప్రయత్నాలను ఖండించాలనీ అవి విజ్ఞప్తిచేస్తున్నాయి. హిందూమహాసముద్రాన్ని గురించిన అంతర్జాతీయ సమావేశాన్ని ఐ.రా.స.సర్వప్రతినిధిసభ చేసిన యిటీవలి తీర్మానానికి అనుగుణంగా త్వరగా, 1990 లోపుగా జరపాలని అవి విజ్ఞప్తిచేస్తున్నాయి.

డిగోగార్షియాతోసహా చాగోస్ ఆర్చిపెలాగోపై తన సార్వభౌమాధికారాన్ని పునరుద్ధరించాలని మారిషస్ చేస్తున్న న్యాయమైన డిమాండ్‌కు ఉభయరాజ్యాలూ తమ మద్దతును పునరుద్ఘాటించాయి.

జాత్యహంకారం సకల రూపాలను,వ్యక్తీకరణలనూ అవి ఎక్కడ ఏ రూపంలో వ్యక్తమైనాసరే వాటిని సోవియట్ యూనియన్ భారతదేశాలు తీవ్రంగా ఖండిస్తున్నాయి. దక్షిణాఫ్రికా ప్రజల పోరాటానికి అచంచలమైన మద్దతును పునరుద్ఘాటిస్తున్నాయి. జాత్యహంకారాన్ని జాతి వెలివిధానాన్ని నిర్మూలించేందుకు సమగ్ర, ఆదేశక ఆంక్షల విధింపుతోసహా అనేక చర్యలను ఐ.రా.స. నియమావళి నిర్దేశిస్తున్నదని యీ సందర్భంగా గుర్తుచేస్తున్నాయి. నైరుతి ఆఫ్రికాలో పరిష్కారంకోసం చేసిన అంగోలా - క్యూబా ప్రతిపాదనలను ఉభయ పక్షాలూ హర్షిస్తున్నాయి. చర్చల్లో పురోగతి, నమీబియా స్వాతంత్ర్యాన్ని గురించి భద్రతా సమితి తీర్మానాన్ని బేషరతుగా అమలు జరపడానికి మార్గాన్ని ఆవిష్కరిస్తుందనే ఆశాభావాన్ని అవి వ్యక్తంచేస్తున్నాయి. అలీనోద్యమం యేర్పాటుచేసిన ఆఫ్రికా నిధికి ఎంతో ముఖ్యమైన పాత్ర వుందని, సోవియట్ యూనియన్, భారతదేశాలు భావిస్తున్నాయి.

మధ్య అమెరికా ప్రాంతంలోని రాజ్యాలన్నిటి భద్రతకు, వాటి సార్వభౌమాధికారంపట్ల, గౌరవానికి, వాటి అంతరంగిక వ్యవహారాల్లో బయటి జోక్యంలేకుండా స్వయంనిర్ణాయక హక్కుకు, జాతీయ స్వాతంత్ర్యానికి హామీ కల్పించే ప్రాతిపదికపై ఆ ప్రాంతంలోని పరిస్థితికి న్యాయమైన రాజకీయ పరిష్కారంపట్ల ఉభయదేశాలూ తమ మద్దతును పునరుద్ఘాటిస్తున్నాయి. యీ ప్రాంతంలోని స్వతంత్రదేశాలకు వ్యతిరేకంగా చేసే విదేశీ వత్తిడుల, నిర్వహించే కార్యకలాపాల అన్ని రూపాలనూ ఆపేయల్సిందిగా సోవియట్ యూనియన్, భారతదేశాలు విజ్ఞప్తిచేస్తున్నాయి. అలీనదేశాలు, కాంటడోరా బృందం, ఈ బృందాన్ని బలపరుస్తున్న దేశాల బృందం చేస్తున్న నిర్మాణాత్మక

ప్రతిపాదనలకు తమ మద్దతును ప్రకటిస్తున్నాయి. గ్వాటెమాలా ఒప్పందాన్ని అవి ఆమోదిస్తున్నాయి.

సార్వత్రిక శాంతి సుస్థిరత్వాలను నిర్మించాలంటే అది ఆర్థికంగా బలమైన పునాదులపై మాత్రమే సాధ్యమని సోవియట్ యూనియన్, భారతదేశాలు భావిస్తున్నాయి. న్యాయమైన, సమానప్రాయీ ప్రాతిపదికపై ఒక నూతన అంతర్జాతీయ ఆర్థికవ్యవస్థను నెలకొల్పాలి. ప్రపంచవ్యాప్తంగా పెరుగుతున్న రుణ సమస్యనూ, అంతర్జాతీయ ఆర్థిక, ద్రవ్య వ్యవస్థలో సంక్షోభాన్నీ పరిష్కరించేందుకు తక్షణ, గంభీరమైన చర్యలు తీసుకోవడం అవసరం. సరకుల ధరలు పడిపోవడమనేది అనేకదేశాల ప్రయోజనాలకు హాని చేస్తోంది. సాంకేతిక పరిజ్ఞానం బదిలీకిగల అవరోధాలను తొలగించాలి. వ్యాపారానికి కృత్రిమ అవరోధాలను నిర్మూలించాలి. నిరాయుధీకరణ ఫలితంగా పొదుపుకాగల వనరులను అభివృద్ధి లక్ష్యాలకు మళ్ళించాలి. నిరాయుధీకరణ, అభివృద్ధి గురించి ఐ.రా.స. సమావేశం చేసిన నిర్ణయాలను అమలుజరపాలి.

జీవ్యావరణ పరిరక్షణకూ, పుడమి వనరుల హేతుబద్ధ వినియోగానికి ఐ.రా.స. తోడ్పాటుతో ఒక ప్రపంచవ్యాప్త వ్యూహాన్ని ఆమోదించాలని ఉభయదేశాలూ విజ్ఞప్తిచేస్తున్నాయి.

విశ్వాసాన్ని అవగాహనను పెపొందిందించేందుకు దేశాల ప్రజలకూ ప్రజలకూ మధ్య సంబంధాలను ప్రోత్సహించి, మెరుగుపర్చాలని ఉభయపక్షాలూ భావిస్తున్నాయి. టూరిజం, వ్యాపారం, పండితులు, పాత్రికేయులు, పార్లమెంటేరియన్లు, రాజకీయవేత్తలు, యితర ప్రజాప్రతినిధుల మధ్య మరింత సహకారం. అలాగే సాంస్కృతిక ఉత్సవాలు వీటిద్వారా పై లక్ష్యాన్ని సాధించవచ్చు.

సోవియట్ యూనియన్, భారతదేశాల మధ్య సంబంధాలు లోతుగా వేళ్లూనుకున్నాయి; విభిన్న సామాజిక-రాజకీయ వ్యవస్థలు గల దేశాలమధ్య నిర్మాణాత్మక సహకారానికి యివి ఒక ఆదర్శం. చిత్తశుద్ధితోకూడిన మైత్రి, పరస్పరావగాహన వాటి విలక్షణత. అవి దశాబ్దాలుగా స్థిరంగా, అవిచ్ఛిన్నంగా పెంపొందుతున్నాయి. సోవియట్-భారతదేశ శాంతి, స్నేహ, సహకార సంధి వాటి సంబంధాల్లో ఒక అసాధారణమైన ఘట్టం; ఆ సంబంధాలను మరింత అభివృద్ధిచేసేందుకూ, ప్రపంచంలో శాంతి సుస్థిరతలను పెంపొందించేందుకూ విశ్వసనీయమైన, కాలపరీక్షకు తట్టుకొని నిల్చే చట్టాన్ని సమకూర్చగలదు. సోవియట్ యూనియన్, భారతదేశాల విదేశాంగవిధాన అగ్ర ప్రాధాన్యాల్లో యీ సంధికిగల మౌలిక ప్రాముఖ్యత, మారుతున్న నేటి ప్రపంచంలో మరింత పెరిగింది.

ఇటీవలికాలంలో అత్యున్నతస్థాయిలో క్రమబద్ధంగా జరిగిన పర్యటనలు సోవియట్-భారత సంబంధాలకు గుణాత్మకంగా ఒక నూతన స్వభావాన్ని శక్తిని సమకూర్చాయి. పెరుగుతున్న పరస్పరావగాహన, విశ్వాసం, నూతన రంగాలకు, రూపాలకు పరివ్యాప్తమైనట్టి ముమ్మరమైన ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక సహకారం, ప్రజలకూ ప్రజలకూమధ్య మరింత యెక్కువగా సంబంధాలు — యివి యీ సంబంధాల విశిష్టత. ఒండొరులదేశాల్లో అపూర్వమైన భారీస్థాయిలో జరిగిన భారతదేశం, సోవియట్ యూనియన్ ఉత్సవాల్లో యిది స్పష్టంగా ప్రతిబింబించింది. యీ ఉత్సవాలు భారతదేశ స్వాతంత్ర్య 40వ వార్షికోత్సవం, అక్టోబర్ సోషలిస్టు మహావిప్లవ 70 వ వార్షికోత్సవం సందర్భంగా జరిగాయి. స్నేహ సుహృద్భావాలను వ్యాప్తిచేయడంలో యివి ఉజ్వలమైన ఘటనలు.

అత్యున్నతస్థాయి పర్యటనలు, యీనాటి ప్రపంచ సమాజం ముందున్న నిరాయుధీకరణ, ప్రాంతీయ వివాదాలు, ఘర్షణల విషయంలో శాంతియుత పరిష్కారం, మరింత న్యాయమైన, ప్రజాతంత్రయుతమైన ప్రపంచ వ్యవస్థను నెలకొల్పడం వంటి పెద్ద సమస్యలపై తరచు సంప్రదింపులు సంయుక్త కార్యాచరణల సంప్రదాయాన్ని కొనసాగించాలనీ నిర్ణయించడం జరిగింది.

ఆర్థికరంగంలో - ఆధునికీకరణ, అలాగే సోవియట్, భారత ఆర్థికవ్యవస్థల మారుతున్న స్వభావం సృష్టిస్తున్న నూతన శక్తిస్తోమతలను, అవకాశాలను పరిపూర్ణమైన మేరకు వినియోగించుకోవడం ముఖ్యమని అవి భావిస్తున్నాయి. సంయుక్త ప్రాజెక్టులతోసహా పరస్పర ప్రయోజనకరమైన ఆర్థికసహకార నూతన రూపాలను అభివృద్ధి చేసేందుకు తమ ఆర్థికవ్యవస్థల్లో తలెత్తుతున్న పరస్పర పూరకాలను గుర్తించి, పూర్తిగా ఉపయోగించుకోవడం అవసరమని ఉభయపక్షాలూ భావిస్తున్నాయి. శక్తివంతమైన పెరుగుదలకు హామీ కల్పించేందుకై వాణిజ్య నిర్మాణ స్వరూపాన్ని మెరుగుపర్చడం, నూతన వ్యూహాలను రూపొందించడం అవసరం. 1986 నుంచీ వాణిజ్యంలో కనిపించిన శీఘ్రతర పెరుగుదలను అట్లాగే కొనసాగించేందుకు అవి శాయశక్తులా కృషిచేస్తాయి. 2000 వ సంవత్సరం పర్యంతానికి దీర్ఘకాలిక ఆర్థిక, వాణిజ్య, శాస్త్ర, సాంకేతిక సహకార కార్యక్రమాన్ని రూపొందిస్తాయి.

ప్రపంచ భవితవ్యంపట్ల బాధ్యత-చిన్నాపెద్దా అన్నిదేశాలపై ఆధారపడి వుందని సోవియట్ యూనియన్, భారతదేశాలు నొక్కి చెప్తున్నాయి. అంతర్జాతీయ సమస్యలకు, సంక్షోభ పరిస్థితులకు పరిష్కారాలను కనుగొనడానికీ, యితర ప్రపంచవ్యాప్త సమస్యలను పరిష్కరించడానికీ ఐక్యరాజ్యసమితి తప్పని సరిగా అవసరమైన సంస్థ. యిటీవలి కాలంలో **ఐ.రా.స.** ద్వారా సంస్థల కార్యకలాపాలు పెరుగుతూండడం పట్ల అవి సంతృప్తిని వ్యక్తం చేస్తున్నాయి. యీ విశ్వసంస్థ అధికారం, శక్తి సామర్థ్యాలు మరింత పెంపొందాలని కోరుతున్నాయి. అదే సమయంలో, **ఐ.రా.స.** వ్యవస్థ తన లక్ష్యాన్ని మరింత బాగా నెరవేర్చగలిగేందుకై, ప్రపంచంలో మారుతున్న వాస్తవికతలకు అనుగుణంగా వ్యవహరిస్తూ, వాటిని ప్రతిబింబింపజేయాలి.

ప్రపంచంలో అలీనోద్యమం నిర్వహిస్తున్న ప్రధానపాత్రను గురించి సోవియట్ యూనియన్, భారతదేశాలు నొక్కి చెప్తున్నాయి. శాంతికి, నిరాయుధీకరణకు, అభివృద్ధికి సంబంధించిన సమస్యలను పరిష్కరించేందుకు అదొక నిర్మాణాత్మక, ప్రభావోపేత పథ నిర్దేశక శక్తిగా ఆవిర్భవించింది. అంతర్జాతీయ ఉద్రిక్తతలను ఉపశమింప జేయడానికి తనవంతు దోహదం కూర్చింది. ప్రపంచంలో తలెత్తుతున్న సవాళ్లను యెదుర్కోవడంలో యీ ఉద్యమం నానాటికీ అధిక పాత్ర నిర్వహిస్తూనే వుంటుందని ఉభయ పక్షాలూ ప్రగాఢంగా విశ్వసిస్తున్నాయి.

అధునాతన సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన, అత్యున్నత నాణ్యతగల ఉత్పత్తులకు సంబంధించి ఉభయదేశాల్లో పెరుగుతున్న అవసరాలను తీర్చేందుకుగాను తమతమ దేశాలలో అభివృద్ధిచేసిన అధునాతన సాంకేతిక పద్ధతుల ఆదానప్రదానాలు, సంయుక్త పరిశోధన, అభివృద్ధితోసహా నిర్దిష్ట సహకార ప్రాజెక్టులను రూపొందించడం అవసరమని కూడా సోవియట్‌యూనియన్, భారతదేశాలు అంగీకరిస్తున్నాయి. సోవియట్ యూనియన్, భారతదేశాల ఉత్సవాలనే ఆరోగ్యకరమైన సంప్రదాయాన్ని కొనసాగించాలనీ, సోవియట్-భారత శాంతి, స్నేహ, సహకార సంధి 20వ వార్షికోత్సవాన్నీ, అణ్వస్త్రరహిత, హింసారహిత ప్రపంచ సూత్రాల గురించిన ఢిల్లీ ప్రకటన 5వ వార్షికోత్సవాన్ని పాటించాలనీ తమ ఆకాంక్షను వుభయపక్షాలూ పునరుద్ఘాటించాయి.

అన్ని రంగాల్లో తమ సంబంధాలను మరింత అభివృద్ధిపర్చి, దృఢగాఢవంతం చేసేందుకు కృతనిశ్చయాన్ని వ్యక్తంచేశాయి. సోవియట్-భారత సంబంధాల అభివృద్ధి వాటి దేశ ప్రజల ప్రయోజనానికి తోడ్పడుతుంది; ఒక సమగ్ర ప్రాతిపదికపై శాంతి భద్రతలను పటిష్ఠంచేసేందుకూ, ఆసియాలో, ప్రపంచమంతటా అభివృద్ధిని పెంపొందించడానికీ యిదొక ముఖ్యమైన అంశం.

(టాస్ 1988 నవంబర్ 20)

# మిహాయిల్ గోర్బచేవ్ సందర్శన సందర్భంగా సంతకాలు జరిగిన సోవియట్ - భారతపత్రాలు

**భారతదేశంలో అణువిద్యుత్కేంద్రం నిర్మించడంలో సహకారంపై ఒప్పందం**

మెరుగైన అత్యాధునిక వి.వి.ఇ.ఆర్-1000 రకం రియాక్టర్లను ఉపయోగించి సోవియట్ సహాయంతో ఒక కొత్త అణువిద్యుత్కేంద్రాన్ని నిర్మించడం, పెరుగుతున్న భారత ఆర్థిక వ్యవస్థకు ఎంతో అవసరమైన విద్యుచ్ఛక్తి స్తోమత పటిష్టీకరణకు గణనీయమైన దోహదం చేస్తుంది. ఈ అణువిద్యుత్కేంద్రాన్ని ఎక్కడ నిర్మించేదీ భారత ప్రభుత్వం నిర్ణయిస్తుంది.

అణువిద్యుత్కేంద్ర నిర్మాణానికి అవసరమైన యంత్ర పరికరాలనూ, సాధనాలనూ, పదార్థాలనూ సోవియట్ యూనియన్ సరఫరా చేస్తుంది.

**రెండుసార్లు పన్ను విధింపును తప్పించడంపై ఒప్పందం**

పరస్పర ఎగుమతి, దిగుమతి చెల్లింపుల పద్ధతిని సరళంచేయడంద్వారా ఈ ఒప్పందం సోవియట్ యూనియన్, భారతదేశాలమధ్య ద్వైపాక్షిక వ్యాపారాన్ని విస్తరింప చెయ్యడంలో ముఖ్యపాత్ర నిర్వహిస్తుంది. యిది సోవియట్ ఉత్పత్తిసంస్థలకూ, భారత దేశ కంపెనీలకూమధ్య ప్రత్యక్ష సంబంధాలను నెలకొల్పడంలో సహాయపడుతుంది.

సోవియట్ యూనియన్‌లో భారతదేశానికి చెందిన ఒక కంపెనీ నిర్మించిన కర్మాగారం తన ఉత్పత్తులను సోవియట్ యూనియన్‌లో మాత్రమే అమ్మితే, అది భారతదేశంలో పన్ను చెల్లించనవసరం లేదని, ఈ ఒప్పందం పేర్కొంటోంది. అలాగే భారతదేశంలో యిలాంటి సోవియట్ కంపెనీ ఉత్పత్తులకు కూడా యిది వర్తిస్తుంది.

**విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల నిర్మాణంలో ఆర్థిక, సాంకేతిక సహకారంపై ఖరారునామా**

3,270 మెగావాట్ల మొత్తం విద్యుదుత్పాదక స్తోమతగల తాప విద్యుత్కేంద్రాలను వింధ్యాచల్, మైతోన్, కాయంకుళమ్, మంగుళూరు, కోల్ డాంలలో టర్న్‌కీ ప్రాతిపదికపై నిర్మించేందుకు సోవియట్ సహాయం అందిస్తుంది. భారతదేశం అదనంగా మరో 2,730 మెగావాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసేందుకుగాను సోవియట్ సహాయం అందిస్తుంది. క్రీ.శ.

2000వ సంవత్సరానికి ఈ మొత్తం ఉత్పత్తి 6,000 మెగావాట్లు వుండేలా సహాయం అందిస్తుంది.

**వింధ్యాచల్ థర్మల్ విద్యుత్కేంద్రం రెండవదశ నిర్మాణంలో సహకారంపై ఒప్పందం**

వింధ్యాచల్ సూపర్ థర్మల్ విద్యుత్కేంద్ర రెండవ దశను సోవియట్ సహాయంతో నిర్మిస్తారు. సూపర్ క్రిటికల్ ఆవిరి పారామీటర్లలో, ఒక్కొక్కదాని ఉత్పాదన స్తోమత 500 మెగావాట్లుగల రెండుయూనిట్లు, 765 కె.వి. ట్రాన్స్మిషన్ లైన్లు (దాదాపు 900 సర్క్యూట్ కిలోమీటర్ల పొడవుగలవి), సబ్స్టేషన్ యంత్రపరికరాలు ఉంటాయి. భారత ప్రభుత్వానికి ఏటా 2.5 శాతం వడ్డీపై 330 మిలియన్ల రూబుల్ల మేరకు రుణం యివ్వడం జరుగుతుంది.

**శాంతియుత ప్రయోజనాల కోసం దూర రోదసి పరిశోధన, వినియోగాలలో దీర్ఘకాలిక సహకారంపై ఒప్పందం.**

రోదసి రంగంలో సోవియట్-భారత సహకారానికి ఈ ఒప్పందం మరింత ఊపునిస్తుంది. 1991లో జరగాలని నిర్ణయించిన ఉమ్మడి అంతరిక్ష ఉపగ్రహ ప్రయోగం రోదసీ సహకారానికి ఉదాహరణల్లో ఒకటి — భారతదేశం తయారుచేసిన గామా టెలిస్కోపులను ఉపయోగించి చేసే ప్రయోగాలు యిందులో వుంటాయి.

**1989-1990 కి సాంస్కృతిక, విజ్ఞానశాస్త్ర, విద్యారంగాల్లో ఆదానప్రదానాల కార్యక్రమం**

ఈ ఒప్పందం కింద శాస్త్రజ్ఞుల, రచయితల, యువజనుల, బాలల ప్రతినిధివర్గాల పరస్పర పర్యటనలు జరుగుతాయి. మిత్రదేశంలోని తమ సహచరుల జీవితాన్ని గురించీ, కార్యకలాపాలగురించీ, పనిని గురించీ మరింత లోతుగా, మరింత బాగా తెలుసుకోవడానికి వారికి యిది తోడ్పడుతుంది.

ఆధునిక ప్రపంచంలో 'శిఖరాగ్ర సమావేశాలు' రాజ్యాధిపతుల, ప్రభుత్వాధినేతల మధ్య ఒక కొత్త రకం దౌత్య పద్ధతి అయ్యాయి. శిఖరాగ్ర సమావేశాలవల్ల త్వరగా నిర్ణయాలు తీసుకోవడానికి వీలు కలుగుతుంది. దీర్ఘకాలిక ఒప్పందాలు సుళువవుతాయి. ప్రజలు తమ నాయకుల పనితీరును టెలివిజన్ ద్వారా, సామూహిక బహుళప్రసార సాధనాల ద్వారా వీక్షించడానికి అవకాశం కలుగుతుంది. ఇదివారికి ఒక వేడుకకావడం, తమ దేశాల పౌరజీవిత వ్యవహారాలను గురించి నింపాదిగా ఆలోచించడానికి, వ్యాఖ్యానించడానికి, ఈ వ్యవహారాల్లో పాల్గొనే సమయంకూడ. మిహయీల్ గొర్బచేవ్ భారత సందర్శన మైత్రీపర్వదినం అయింది. అది భారత ప్రజలకు ఆత్మావలోకనం చేసుకుని ఒకరి జాతీయ ఘనత పట్ల ఒకరి అంతర్జాతీయ అక్కరలపట్ల మరొకరిగౌరవ భావంపై ఆధారపడి ఉన్న భారత-సోవియట్ సంబంధాల ప్రాముఖ్యాన్నీ ప్రగాఢతనూ గ్రహించడానికి లభించిన ఒక విరామం అయింది.

భారత సోవియట్ సంబంధాలు సౌహార్దతలో ద్వైపాక్షిక సహకారంలో ఒక కొత్త ఉన్నత స్థాయిని సంతరించుకున్నాయి; మండలంలోను ప్రపంచంలోను శాంతికీ, ప్రపంచాభివృద్ధి క్రమానికీ తోడ్పడేవిధంగా యివి ప్రభావితం చేయగలవు అని సిపిఎస్యు కేంద్రకమిటీ ప్రధానకార్యదర్శి, సోవియట్ యూనియన్ అధ్యక్షులు మిహయీల్ గొర్బచేవ్ భారతదేశానికి రెండవసారి పర్యటన (నవంబరు 18-20 1988) ముగింపు సమయంలో ఉద్ఘాటించారు. ఇది ముఖ్యమైన ప్రకటన భారతదేశంలో సోవియట్ యూనియన్ ఉత్సవం ముగింపూ, మిహయీల్ గొర్బచేవ్‌కు ఇందిరాగాంధీ శాంతి, సహకార అభివృద్ధి బహుమతి ప్రదానం ఈ పర్యటన సమయంలోనే జరిగాయి. అంతర్జాతీయ సంబంధాల్లో గణనీయమైన పరిణామాలు జరుగుతున్న సమయంలో మిహయీల్ గొర్బచేవ్ శక్తివంతమైన చొరవ

# చక్కని ద్వైపాక్షికతా, అంతర్జాతీయ సహకారాల ప్రవర్థమాన స్తోమత

## ప్రొఫెసర్. రషీదుద్దీన్ ఖాన్

వల్ల ప్రారంభమైన "నూతన ఆలోచనా సరళి", పెరిస్త్రోయికాల ప్రభావం సర్వత్రా గోచరిస్తున్న సమయంలో యీ సందర్శన జరిగింది.

గొర్బచేవ్ భారతదేశ ప్రథమ సందర్శన సందర్భంగా, 1986 నవంబర్‌లో రాజీవ్ గాంధీ, మిహాయిల్ గొర్బచేవ్‌లు సంతకాలు చేసిన ఢిల్లీ ప్రకటన అణ్వస్త్ర రహిత, హింసా రహిత ప్రపంచాన్ని నిర్మించడానికి సంబంధించిన 10 ప్రాథమిక సూత్రాలను రూపొందించింది. మరింత న్యాయమైన, మానవతాయుతమైన అంతర్జాతీయ వ్యవస్థకు యీ ప్రకటన నిజంగా ఒక తాత్విక పునాది. వివాదాలను శాంతియుతంగా పరిష్కరించు కోవడం, తలపాటు రాజకీయాల స్థానే సహనం, ఉద్రిక్తతోపశమన రాజకీయాలకు ప్రాధాన్యం యివ్వడమన్న నూతన ధోరణుల పై దాని ప్రభావాన్ని అంచనా వేయడం ఉభయదేశాలకూ యిటీవలి యీ సందర్శనలో వీలు కలిగింది.

భారతదేశానికీ, సోవియట్ యూనియన్‌కూ సంబంధం ఉన్న కొన్ని పెద్ద పరిణామాలు అంతర్జాతీయరంగం పై సంభవించిన నేపథ్యంలో యీ సందర్శన జరిగింది. ఆ ఘటనలివి : (i) ఐ.ఎన్.ఎఫ్ సంధిపై అమెరికా, సోవియట్‌యూనియన్ సంతకాలు చేయడం (ప్రపంచంలోని మొత్తం అణ్వస్త్రాల్లో 4 శాతం కన్నా తక్కువే అయినప్పటికీ ఒకరకం అణ్వాయుధాలను యిది నిర్మూలించింది). (ii) వ్యూహాత్మకదాడి ఆయుధ వ్యవస్థలో 50 శాతం తగ్గింపును గురించి అమెరికాకూ, సోవియట్ యూనియన్‌కూ మధ్య అవగాహన కుదరడం.(అమెరికా సోవియట్ శిఖరాగ్రసమా వేశంలో చర్చించి, పరిష్కరించాల్సి వున్న అంశాల్లో యిది ప్రధానమైనది) (iii) అతిక్లిష్ట పరిస్థితిని సంప్రదింపుల ద్వారా పరిష్కరించు కోవడానికి ఆచరణాత్మక చర్యలను నిర్దేశిస్తూ ఆఫ్ఘనిస్తాన్ సమస్యపై బహు పక్ష జెనీవా ఒప్పందం మీద సంతకాలు జరగడం (అయితే, అమెరికా, పాకిస్తాన్‌లు న్యాయాన్యాయాలను లెక్కచేయకుండా, ఈ ఒప్పందాన్ని పాటించ నిరాకరిస్తూ, ప్రతిష్టంభనను సృష్టిస్తున్నాయి) (iv) కంపూచియా సమస్యకు పరిష్కారం దగ్గర పడటం (యిది ఆగ్నేయాసియాలో ఘర్షణలను నివారించడానికి ఒక ఆశావహవాతావరణాన్ని సృష్టించింది). (V) అంగోలా సమస్య పరిష్కార విషయంలో సానుకూల పురోగతిని సాధించడం (దక్షిణాది ఆఫ్రికాప్రాంతంలో పరిస్థితిని చక్క దిద్దేందుకు కావలసిన సానుకూల రాజకీయ పర్యవసానాలకు దీనివల్ల దారియేర్పడు తుంది); (Vi) ఇరాన్, ఇరాక్‌ల మధ్య ఎనిమిది సంవత్సరాలపాటు జరిగిన విధ్వంసక, వ్యర్థ యుద్ధం ఆగిపోవడం (దీనివల్ల పశ్చిమాసియాకు ఎంతో అవసరమైన శాంతి నెలకొనింది): (Vii) పశ్చిమగట్టున ఉన్న పాలస్తీనియన్ ప్రజల బలమైన విశాలోద్యమం (ఇదివారి పోరాటానికి ఒక కొత్త ఊపునిచ్చింది. పాలస్తీనా రాజ్యం స్థాపితమైందన్న ప్రకటనతో ఇది పరాకాష్టనందుకొంది; ఈ రాజ్యాన్ని నేడు

భారతదేశం, సోవియట్ యూనియన్, ఇంకా అనేక అనేక దేశాలు గుర్తించాయి)

మిహయిల్ గొర్బచేవ్ నాయకత్వాన సోవియట్ యూనియన్ తీసుకొన్న చొరవ, ఐదు ఖండాలకు చెందిన ఆరు దేశాల సమావేశం జరిపించిన భారతదేశం చొరవ ఈ పరిణామాలకు ఎదో ఒక విధంగా మూల కారణమని చెప్పవచ్చు. మిహయిల్ గొర్బచేవ్, రాజీవ్ గాంధీ తమ రాజకీయ చర్చల్లో వీటిని సమీక్షించారు. వీరుభయులూ తమతమ దేశాల నాయక పదవులను చేపట్టినప్పుడు అంతర్జాతీయ పరిస్థితి గడ్డుగా ఉండేది. సోవియట్ యూనియన్, భారతదేశం ప్రపంచశాంతికోసం చేసిన సంయుక్త కృషికేవలం రెండేళ్ళలోనే సత్ఫలితాలను సాధించడం ముదావహం.

ఈ రెండు దేశాలు చైనా ప్రజా రిపబ్లిక్‌తో మరింత మంచి సంబంధాలు నెలకొల్పుకొనేందుకు తగుజాగ్రత్తలతో ప్రయత్నించాలని ఉద్దేశిస్తుండటం ఒక విషయం. రాజీవ్ గాంధీ మిహయిల్ గొర్బచేవ్‌లు ఇందిరా గాంధీ బహుమతి ప్రదాన సందర్భంలో చేసిన ప్రసంగాల్లోను ఆసియా పసిఫిక్ మండల శాంతి, భద్రత లపై దృష్టి కేంద్రీకరిస్తూ వారు జరిపిన చర్చల్లోనూ ఈ భావం వ్యక్తమైంది. భారత-చైనా సంబంధాలు మెరుగు పడుతున్న సూచనలున్నందుకు మిహయిల్ గొర్బచేవ్ సంతోషాన్ని వ్యక్తంచేస్తూ చైనాతో సోవియట్ సంబంధాలు, "పోత్సాహకరంగా రూపుగొంటున్నవి" అని చెప్పారు. త్వరలోనే జరగనున్న సోవియట్ - చైనా శిఖరాగ్ర సమావేశం కోసం ఆశాభావంతో ఆయన ఎదురు చూస్తున్నారు. భారతదేశం, సోవియట్ యూనియన్, చైనాలు సంఘీభావంతో వ్యవహరిస్తే యావత్తు ప్రపంచ పరిస్థితీ మారి పోతుందని లెనిన్‌కలలు గన్నారు. ఇటుభారత -చైనా సంబంధాలు, అటు చైనా-సోవియట్ సంబంధాలుకుదుట పడితే, పరస్పర విశ్వాసంతో ప్రపంచశాంతి, సౌభాగ్యాల కోసం ఈ మూడు దేశాలు కలిసిపాటుపడితే, లెనిన్ కలనిజం కావచ్చు.

భారతదేశం, సోవియట్ యూనియన్‌ల సామాజిక, రాజకీయ వ్యవస్థలు భిన్నంగా ఉన్నప్పటికీ, ప్రపంచాభివృద్ధి ప్రధాన గమ్యాల పట్ల వాటి దృక్పథాలు ఒకటే. భవిష్యత్తును గురించిన వాటి అవగాహనలో సారూప్యముంది. ఈగట్టి వాస్తవాలే సోవియట్-భారత స్నేహానికి ప్రాతిపదిక అని మిహయిల్ గొర్బచేవ్ నిర్ద్వంద్వంగా చెప్పారు. సోవియట్, భారత సంబంధాలు ఈనాటి రెండు బలవత్తర శక్తుల—సోషలిజం, దిగ్విజయం పొందిన జాతీయ విమోచనోద్యమం — కలయికను వ్యక్తం చేస్తున్నవని ఆయన పునరుద్ఘాటించారు. కాబట్టి, సోవియట్‌యూనియన్, చైనాల మధ్యా, భారతదేశం, చైనాల మధ్యా సదవగాహనను పెంపొందించే ఇతర చర్యలవల్ల, భారత - సోవియట్ సంబంధాలు మారబోవు. అమెరికాతోను, పాశ్చాత్య దేశాలతోను ఉద్రిక్తతో పశమనాన్ని చైనాతో సయోధ్యను పెంపొందించుకొనే నూతన విధాన కారణంగా సోవియట్ యూనియన్ తన ప్రాథమ్యాలను మార్చుకొంటుందని కొందరుచేస్తున్న వాదనలను మిహాయిల్ గొర్బచేవ్ స్పష్టంగా తిరస్కరించారు.

"పూర్తిగా నిరాధారమూ, స్పష్టంగా ఊహాగాన జనితమూ అయిన అటువంటి మాటలకు సమాధాన మివ్వడం ద్వారా వాటికి పెద్దపీట వేయ ను." అని ఆయన వ్యంగ్యంగానే అయినప్పటికీ అతి స్పష్టంగా రాష్ట్రపతిభవన్ విందు ప్రసంగంలో చెప్పారు. సోవియట్ యూనియన్ ప్రపంచ విధానంలో మార్పు రావచ్చునన్న కొంతమంది వ్యాఖ్యాతల దురుద్దేశపూర్వక విశ్లేషణల తర్వాత ఇటువంటి ప్రకటన వెలువడటం, హర్షణీయం. ఢిల్లీ ప్రకటనకూ, ప్రత్యేకించి అణ్వాస్త్ర రహిత,

హింసారహిత ప్రపంచం గురించిన దాని భావనకుగల విప్లవాత్మక ప్రాముఖ్యాన్ని మిహయిల్ గొర్బచేవ్ నొక్కి చెప్పారు. ''అణ్వాస్త్ర రోగాన్ని'' నిర్మూలించేందుకూ, అభివృద్ధికోసం ప్రపంచ కృషిని ముందుకు తీసుకుపోయేందుకు భారతదేశం, సోవియట్ యూనియన్‌ల సంయుక్తకృషి ప్రాముఖ్యతను ఆయన యీమాటల్లో నొక్కి చెప్పారు. ''మన ద్విపక్ష .సహకారాన్ని విస్తరింపజేయటంవల్ల సోవియట్-భారత సంబంధాల అంతర్జాతీయ శక్తి పెరగడం సహజమే. దాని పురోగతిని చూచి మేము, మొత్తంపై, సంతోషిస్తున్నాము. గడచిన రెండేళ్ళలో పలు దీర్ఘకాలిక కార్యక్రమాలను ఆమోదించాము. వాటిని అమలుపర్చటం వల్ల మన సహకారానికి ఒక కొత్త గుణం అబ్బుతుంది.''

మిహయిల్ గొర్బచేవ్ భారత సందర్శన ముగింపులో వెలువడిన సోవియట్-భారత శిఖరాగ్ర ప్రకటన ప్రధాన ప్రపంచ సమస్యల గురించిన రెండు దేశాల ఆలోచనా సరళిని బేరీజు వేస్తోంది, ''భిన్న సామాజిక - రాజకీయ వ్యవస్థలుగల రెండు దేశాల మధ్య నిర్మాణాత్మక సహకారానికి వాటి సంబంధాలు ఒక ఆదర్శం,'' అని అది పునరుద్ఘాటిస్తోంది. ఈ సందర్భంగా మిహయిల్ గొర్బచేవ్ ఇలా చెప్పారు: ''రాజకీయ సంభాషణల విషయంలో, - అంటే ప్రపంచ రాజకీయాల ప్రధాన సమస్యల పట్ల రూపు గొంటున్న దృక్పథాల చర్చలో - మన సంబంధాలు కొత్తవైన ఉన్నత స్థాయిలను అందుకొంటున్నాయి; ఆర్థిక సహకార రంగంలో కూడ అవి కొత్త విస్తృత విలక్షణతను అలవర్చుకొన్నాయి.''

భారతదేశానికి మిహయిల్ గొర్బచేవ్ రెండవ సందర్శన, భారత, సోవియట్ దేశాల మధ్య కొనసాగుతున్న అన్యోన్యతను ధ్రువపరచింది. ద్విపక్ష వ్యవహారాల్లో నిజంగా ఒక కొత్త పరిణతిని వ్యక్తం చేసింది. సోవియట్-భారత సంబంధాలు ఏళ్లు గడిచేకొద్దీ మరింత ప్రగాఢమైన ప్రాముఖ్యాన్ని సంతరించుకొంటున్నాయని, ఈ సందర్శన నిరూపించింది; మరింత సమానతగల న్యాయమైన, మానవతాయుతమైన భావిప్రపంచం గురించి ఒకే దృక్పథమున్న రెండు పెద్ద ప్రపంచదేశాలు విశ్వశాంతి, సౌభాగ్యాల ఆశయానికి అనుగుణంగా నిర్వహిస్తున్న ద్వైపాక్షిక వ్యవహారాలకూ, సృజనాత్మక అంతర్జాతీయ సహకారానికీ, ఈ సంబంధాలు మరింత విస్తృతవైవిధ్యాన్ని సమకూరుస్తున్నాయని కూడ ఈ సందర్శన రుజువు చేసింది.

# సోవియట్ - భారత వ్యాపారం, ఆర్థిక సంబంధాల భవిష్యదవకాశాలు

## శంకర్ నారాయణ్

గత మూడేళ్ళలో, భారత-సోవియట్ సహకారంలో ముఖ్యమైన మార్పులు సంభవించాయి. ఇప్పుడు రూపొందిన కొత్త దశలోని అంతర్గతావకాశాలు నిజంగా అపారమైనవి.

ప్రధాని రాజీవ్‌గాంధీ సోవియట్ యూనియన్ సందర్శన సమయంలో ఈ సహకార చట్రాన్ని రూపొందించడం జరిగింది; మార్గదర్శక సూత్రాలపై ఒప్పందం కుదిరింది. 1986 నవంబరులో మిహయిల్ గోర్బచేవ్ భారత దేశ ప్రథమ-సందర్శన సందర్భంగా, దీర్ఘకాలిక సహకార కార్యక్రమంపై సంతకాలు జరిగాయి, భారతీయ ప్రైవేటురంగంతో సహా సంయుక్త పరిశ్రమల స్థాపన, ఉత్పత్తి సహకారం నెరవడం, తదితరాలకు ప్రత్యేక ప్రాధాన్యత నిచ్చే కొత్త సహకార రూపాలను 1987 నవంబర్ ఒప్పందం తలపెట్టింది. 1987 జులైలో శాస్త్ర, సాంకేతిక సహకారానికి సంబంధించిన సమగ్ర దీర్ఘకాలిక సహకార కార్యక్రమాన్ని ఉభయ దేశాలూ చేపట్టాయి.

వీటన్నిటి వల్లా, రు. 6,000 కోట్ల తాజా సోవియట్ రుణంవల్లా, సహకారం (ముఖ్యంగా ప్రభుత్వ రంగంతో) విస్తృతంగానూ, ముమ్మరంగాను అభివృద్ధి చెందడానికి వీలుకలుగుతోంది. ఇటీవలి రు.5,400కోట్ల సోవియట్ రుణం ప్రస్తుతం అమలు జరుగుతున్న కొన్ని ప్రభుత్వరంగ ప్రాజెక్టులకూ, ప్రైవేటు రంగంతో సహకారానికీ ఉపయోగపడుతుంది. ముఖ్యంగా, చమురు, బొగ్గు, విద్యుచ్ఛక్తి, వ్యవసాయం, కంప్యూటర్లు, ఎలెక్ట్రానిక్స్ రంగాల్లో దీర్ఘకాలిక కార్యక్రమాలను ఇప్పటికే రూపొందించారు. 1985 నుంచీ కుదుర్చుకున్న ఒప్పందాలు 30 పెద్ద కొత్త ప్రాజెక్టుల నిర్మాణానికి వీలు కలిగిస్తున్నాయి. విద్యుదుత్పాదనను మరో 6,000 మెగావాట్లు పెంచే విద్యుత్కేంద్రాల నిర్మాణానికీ, 60 మిలియన్ టన్నుల బొగ్గులభించే బొగ్గగనుల తవ్వకానికీ, 6 మిలియన్ టన్నుల స్తోమత గల చమురు శుద్ధి కర్మాగారాల నిర్మాణానికీ, మూడు చమురు ప్రాంతాల (కావేరి, కాంబే, పశ్చిమ బెంగాల్) లో చమురును అన్వేషించడానికీ, బొకారో ఉక్కు కర్మాగారాన్ని ఆధునికీకరించి, దాని ఉత్పత్తి స్థాయిని పెంచడానికీ ఈ ఒప్పందాలు తోడ్పడుతాయి. కొత్తగా నిర్మాణమయ్యే విద్యుత్ కేంద్రాల్లో 2000 మెగావాట్ల అణువిద్యుత్ కేంద్రమొకటి.

నీటి పారుదల, నీటి వినియోగ నిర్వహణ వ్యవస్థలోనూ ఆహార ధాన్యాదుల శుద్ధి రంగంలోనూ గణనీయంగా సహాయ మందించి భారత వ్యవసాయ అభివృద్ధికి సోవియట్ యూనియన్ తోడ్పడుతుంది.

విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల సత్వరాభివృద్ధిపై, ఈ రెండు దేశాల భావి విజయం ఎంతో ఆధారపడి ఉంది. నేడీ దేశాలు సంయుక్త పరిశోధనలో సమాన ఫాయిలో పాల్గొంటున్నాయి. 1987 ఒప్పందం సహకార స్థాయిని పెంచింది. శక్తివంతమైన యాక్సిలరేటర్ల రూపకల్పన, రోదసి, లేజర్ టెక్నాలజీలు, కంప్యూటర్లు,

కొత్త పదార్థాల తయారీ, కెటాలిసిస్, జీవ సాంకేతిక శాస్త్రం, ఇమ్యునాలజీ వంటి అధునాతన సాంకేతిజ్ఞత రంగాల్లో సహకారానికి తావేర్పడింది సౌరశక్తి, లోహాలు తుప్పుపట్టడం, పౌడర్ మెటలర్జీ, అధికోష్ణతా, అధిక పీడన భౌతిక శాస్త్రం, వాతావరణ శాస్త్రం, భూకంపాల నుండీ రక్షణా—యివి సంయుక్త కృషి జరిగే యితర రంగాలు.

సోవియట్ లైసెన్సులనూ, సేవలనూ అమ్మే ఒక జాయింట్ స్టాక్ కంపెనీని భారతదేశంలో నెలకొల్పనున్నారు. యిందువల్ల, సోవియట్ సాంకేతిక పద్ధతులను భారతదేశానికి బదిలీ చేయ వీలు కలుగుతుంది.

భారతీయ ప్రైవేటు రంగంతో సోవియట్ సహకారానికి సంబంధించిన సంస్థాగత, న్యాయ శాస్త్ర పర చట్రాన్ని సృష్టించే పనిని ఉభయదేశాలూ యిప్పటికే పూర్తిచేశాయి. యిది మూడు ప్రధాన పద్ధతులను అనుసరించాల్సి ఉంటుంది: భారత దేశంలోని టర్న్‌కీ ప్రాజెక్టులకు సబ్ కంట్రాక్టర్లుగా భారతీయ కంపెనీలను నియోగించడం; ప్రైవేటు కంపెనిలతో కలిసి ప్రభుత్వం చేపట్టిన కీలక ప్రాజెక్టులకు సోవియట్ సాంకేతిక సహాయం అందించడం; భారత దేశంలో గానీ, సోవియట్ యూనియన్‌లో గానీ భారతీయ కంపెనీలతో కలిసి సోవియట్ యూనియన్ సంయుక్త సంస్థలను నెలకొల్పడం.

ఇక్కడ కూడా సహకరించవలసిన రంగాల నిర్ణయంలో గణనీయమైన కృషి జరిగింది. ఈ సహకారాభివృద్ధిలో "భారత - యు.ఎస్.ఎస్.ఆర్ ఛేంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్" ఒక కీలక పాత్ర నిర్వహిస్తోంది. ఇందుకు సంబంధించిన తొలి చర్యలను ఇప్పటికే చేపట్టారు. సంయుక్తంగా నిర్మించిన "ఢిల్లీ" హొటల్ యిప్పటికే మాస్కోలో విజయవంతంగా నడుస్తోంది. భారతీయ కంపెనీలు తాష్కెంట్, బుఖారా, సమర్కండ్‌లలో మూడు హొటళ్ళు నిర్మిస్తున్నాయి రానున్న సంవత్సరాల్లో సోవియట్ యూనియన్‌లో మరో 30 హొటళ్ళు నిర్మిస్తాయి.

కాని వీటికన్న ముఖ్యమైనవి, పారిశ్రామికోత్పత్తికి సంబంధించిన సంయుక్త సంస్థలు. భారతదేశంలోను, సోవియట్ యూనియన్ లోను దాదాపు 60 సంయుక్త సంస్థలు అనుమతి పొందాయి, లేదా త్వరలో అనుమతి పొందనున్నాయి. ఎలెక్ట్రానిక్స్, సాధనాల తయారీ, రసాయనాలు, ఔషధాలు, లోహకార శాస్త్రమూ, ఇంజనీరింగ్; కలపగుజ్జూ, కాగితం; జవుళి పరిశ్రమా, చర్మ పరిశ్రమ; ఆహార ధాన్యాదుల శుద్ధి; సాంకేతిక సేవలు; హొటళ్ళూ, రెస్టారెంటులు—యీరంగాల్లో ఈ సంయుక్త సంస్థలను నెలకొల్పుతారు

ఇటీవలి కాలంలో, వ్యావసాయి కోత్పత్తుల శుద్ధి పట్ల భారత ప్రభుత్వం అత్యంత శ్రద్ధాసక్తులు చూపుతోంది. ఈ రంగంలో యిప్పటికే అనేక సంయుక్త సంస్థల స్థాపనకు సంబంధించిన ఒప్పందాలు కుదిరాయి. సోవియట్ యంత్రాలూ, యంత్ర పరికరాలను దిగుమతి చేసుకోవడంలో ప్రైవేటు రంగానికి తోడ్పడటం కోసం దానికి భారత దేశ పారిశ్రామికాభివృద్ధి బ్యాంకు ద్వారా గణనీయమైన రుణాలను యిస్తానని సోవియట్ యూనియన్ ప్రతిపాదించింది.

ఈ విధంగా ఉభయ దేశాల మధ్య వ్యాపారం బ్రహ్మాండంగా పెరగడానికి ప్రాతిపదిక ఇప్పటికే ఉంది. ప్రధానంగా బయటికారణాల వల్ల, యిటీవలి కాలంలో, దురదృష్టవశాత్తూ వ్యాపారంలో ఎగుడు దిగుడులు కనిపిస్తున్నాయి. కాబట్టే, భారతదేశానికి సోవియట్ ఎగుమతులకు మరింత విస్తృత పునాది ఎంతో అవసరం. సోవియట్ యూనియన్‌కు భారత దేశ ఎగుమతుల్లో 85 శాతం ప్రైవేటు రంగమే చేస్తున్నది అయితే అది సోవియట్ యూనియన్ నుండీ సరుకుల కొనుగోలు మాత్రం చాలా తక్కువగా చేస్తోంది. 200 పెద్ద భారతీయ కంపెనీలు సోవియట్ నుంచి దిగుమతి చేసుకుంటున్నాయి. అయితే మొత్తం భారత దిగుమతులలో వాటి వాటా 50 శాతం మాత్రమే.

అయితే, 1988-1989 సంవత్సరం వ్యాపార టర్నోవర్ రు.52 బిలియన్లకు చేరుకోగలదని ఆశిస్తున్నారు. 1989-1990 సంవత్సరానికి కొత్త వ్యాపార ఖరారునామా మేరకు, రు.70 బిలియన్ల వ్యాపారం (భారతీయ ఎగుమతులు రు.32 బిలియన్లు) జరగాలని సంకల్పించారు. యిది

అంతకు ముందు సంవత్సరంతో పోలిస్తే 35 శాతం పెరుగుదల; యిదివర కెన్నడూ లేనంత పెరుగుదల. వ్యాపారం తిరిగి పుంజుకొనేందుకు తీవ్రకృషి జరిగిందనేది స్పష్టమే. 1986 లో గొర్బ చేవ్, గాంధీలు సంతకాలు చేసిన ఒప్పందానికి అనుగుణంగా 1992 నాటికి ఈ టర్నోవర్ ను రు.10,000 కోట్లకు పెంచాల్సిన విధి కూడా ఉందని వేరే చెప్పనవసరం లేదు. ఆ విధంగా భారతదేశానికి సోవియట్ యూనియన్‌తో వ్యాపారం చేసే వర్థమాన దేశాల్లో అగ్రస్థానం కొనసాగు తూంది. సోవియట్ యూనియన్‌తో వ్యాపారంలో మొదటి అయిదుస్థానాలు సోషలిస్టు దేశాలకు వున్నాయి. ఆ తరువాత ఆరవ స్థానం భారత దేశానికే వుంది. అయితే భారతదేశ వ్యాపారంలో సోవియట్‌పాలు యిందుకు దీటుగా లేదు. 1987 లో అది 12 శాతం మాత్రమే.

కొద్ది పాటి పెరుగుదల ఉన్నప్పటికీ, సాంప్రదాయక ఎగుమతులు ఎల్లప్పుడూ పెరగవనేది స్పష్టమే. ఎగుమతుల పెరుగుదలలో అధిక భాగం ఇంజ నీరింగ్ సరకుల ఎగుమతి వల్ల మాత్రమే సాధ్యం. పెరిస్త్రోయికా కింద సోవియట్ యూనియన్ సార్వ త్రిక లక్ష్యం ఇదే. భారతదేశం కూడా తన పారిశ్రా మిక సరకుల ఎగుమతికి గొప్ప ప్రాధాన్యం ఇస్తోంది. 1989-1990 వ్యాపార ఖరారు నామాలో సోవియట్ యూనియన్ ఇంజనీరింగ్ సరకులను అధికాధికంగా దిగుమతి చేసుకోవడానికి అంగీక రించడం కూడా అందువల్లనే. తేయాకు, ప్యాకేజ్డ్ టీ, కాఫీ, ఇన్‌స్టంట్ కాఫీ తదితర సాంప్రదాయక ఎగుమతులు కూడా పెరగాల్సి ఉంది. ఇంజనీరింగ్ సరకులా, రెడీమేడ్ దుస్తులా ఎగుమతులు కూడా మరో 50 శాతం పెరగాలి. మరింతగా సోవియట్ యంత్రాలనూ, యంత్ర పరికరాలనూ, దిగుమతి చేసుకోకపోతే భారతీయ ఎగుమతుల కొనుగోలుకు అవసరమయ్యే రూపాయి నిల్వలను సోవియట్ యూనియన్‌కు ఉండేలా చేయడం చాలా కష్టమై పోతుందని కూడా ఇటు భారతదేశం సైతం గ్రహించింది. భారతదేశం సోవియట్ విమానాలను లీజుకు తీసుకుంటోంది. జవుళి పరిశ్రమ యంత్రా లు, గని తవ్వకం యంత్రపరికరాలు, రైల్వే యంత్ర పరికరాలు, మొదలైన రకరకాల నూతన ఉత్పత్తులనూ, యంత్ర పరికరాలనూ సోవియట్ యూనియన్ నుండీ కొనుగోలు చేస్తోంది. చమురు, చమురు ఉత్పత్తుల దిగుమతిని పెంచే యోచన కూడా ఉంది.

అయితే, ఈ కృషినంతటినీ సోవియట్ యూని యన్‌లో ప్రస్తుతం జరుగుతున్న విస్తృత ఆర్థిక సంస్కరణల వెలుగులో, సోవియట్ యూనియన్ తన విదేశీ ఆర్థిక కార్యకలాపాలను సడలించిన దృష్ట్యా చూడాలి. 2000 సంవత్సరం నాటికల్లా సోవియట్ యూనియన్ తన ఉత్పత్తిని రెట్టింపుచేసి, తన ప్రజల జీవన ప్రమాణాలను గణనీయంగా పెంచనున్నది. ఇదంతా సోవియట్ యూనియన్ మార్కెట్ అవసరాలను తీర్చడానికే కాక, అంతకంతకూ పెరిగే పారిశ్రామిక సహసంస్థ లలో ప్రవేశించడానికి కూడా భారతదేశ వ్యాపార సంస్థలకు అవకాశం కలిగిస్తోంది. సోవియట్ దూర ప్రాచ్యం, సైబీరియా ప్రాంతాల్లో సహకారం నెరవ డానికి భారతదేశంతో సహా ఆసియా పసిఫిక్ దేశా లకు అవకాశం కల్పించాలని సోవియట్ యూని యన్ నిర్ణయించింధి. అది సంయుక్త సంస్థల స్థాపనకు మండలాలను ఏర్పాటుచేయ నుంది. ఈ మండలాల్లో ప్రత్యేకించి భారతీయ వ్యాపార సంస్థల సహకారాన్ని సోవియట్ ప్రభు త్వం ఆహ్వానిస్తోంది.

# సోవియట్-భారత సాంస్కృతిక సంబంధాల్లో ముఖ్య ఘట్టం

మావిలేఖరి

న్యూఢిల్లీలోని మవలాంకర్ ఆడిటోరియంలో 1988 నవంబర్ 15న 1988 సోవియట్ భూమి నెహ్రూ బహుమతుల ప్రదానోత్సవం జరిగింది. యీ సందర్భంగా కేంద్ర రక్షణ మంత్రి కె.సి.పంత్ ముఖ్య అతిథిగా విచ్చేశారు.

ముఖ్యమైన ఘటనలు — పై జెప్పిన సభకు ఒకరోజు ముందుగా ప్రారంభమైన, యేడాదిపాటు జరగబోయే జవహర్‌లాల్ నెహ్రూ శతజయంతి వుత్సవాలు, త్వరలో జరగబోతున్న సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రధానకార్యదర్శి, సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ అధ్యక్షుడు అయిన మిహాయిల్ గోర్బచేవ్ పర్యటన — బహుమతుల ప్రదానోత్సవానికి అధిక ప్రాముఖ్యాన్ని సమకూర్చాయి. సోవియట్ అధ్యక్షుని పర్యటనా, ఆయనతో ప్రధాని రాజీవ్‌గాంధీ చర్చలూ భారతదేశం, సోవియట్‌యూనియన్‌లకు మాత్రమేగాక మొత్తంమీద ప్రపంచానికి యెంతముఖ్యమైనవో వక్తలు నొక్కిచెప్పారు.

జవహర్‌లాల్ నెహ్రూ చిత్రమూ, వుభయ దేశాల జాతీయ పతాకలూ, "భారత-సోవియట్ సహకారం వర్ధిల్లాలి" అనే బ్యానరూ నేపథ్యంగా వున్న వేదికపై ఆసీనులైన వారిలో బహుతుల విజేతలు, శ్రీ కె.సి.పంత్, భారత దేశంలోని సోవియట్ రాయబారి వి.ఇసాకవ్, సోవియట్ భూమి నెహ్రూ బహుమతులు కమిటీ అధ్యక్షుడు శ్రీ.టి.ఎన్.కౌల్, సోవియట్



ప్రతినిధి వర్గ సభ్యులు, రచయిత ఎ. అదామవిచ్, సంగీత స్వరకర్త మిహాయిల్ తరివ్యేర్దియెవ్ ప్రాచ్యవిషయాధ్యయన వేత్త మరీయ్మం సల్గానిక్, వున్నారు.

భారతదేశం, సోవియట్‌యూనియన్‌ల జాతీయగీతాల ఆలాపన తర్వాత ప్రముఖ అతిథులకు శ్రీ.టి.ఎన్.కౌల్ స్వాగతం పలికారు.

బహుమతుల కమిటీ సెక్రటరీ జనరల్ డాక్టర్ నమ్వర్‌సింగ్ బహుమతుల విజేతల పేర్లు చదువుతూ వుండగా వుత్సవ సభలో బహుమతులను కేంద్రమంత్రి ప్రదానం చేశారు.

ప్రజలమధ్య స్నేహాన్ని పెంపొందించేందుకై సాహిత్యాన్ని సినిమటోగ్రఫీని అభివృద్ధి పర్చడంలో కె.ఎ. అబ్బాస్ నృత్యర్థం నెలకొల్పిన నయాసంసార్ ట్రస్ట్ చేసిన కృషికి ఆ సంస్థ తరఫున శ్రీమతి ఊర్వశి ఎస్.జైన్; భారతీయ నృత్యాల వారసత్వాన్ని పెంపొందిం చేందుకై కీ.శే. ఉదయ్‌శంకర్ స్థాపించిన భారతదేశ సాంస్కృతిక కేంద్రం జరిపిన కృషికి ఆసంస్థ తరఫున శ్రీమతి అమలాశంకర్; ప్రపంచశాంతి, ఐక్యతలకోసం, భారత-సోవియట్ మైత్రిని పటిష్టం చేయడం కోసం నిర్విరామ కృషి నల్పినందుకు ఢిల్లీ, ఉత్తరఢిల్లీ మెట్రోపాలిటన్ డా. పౌలస్ మార్ గ్రిగోరియోస్; భారత దేశంలో రష్యన్‌భాషా ప్రాచుర్యానికై అసాధారణ సేవచేసినందుకు స్వాతంత్ర్య సమరయోధురాలు, అఖిలభారత రష్యన్‌భాష యిన్‌స్టిట్యూట్ వ్యవస్థాపకురాలు, డైరెక్టర్ అయిన శ్రీమతి కల్పనా జోషీ; హిందీలో రాసిన గ్రంధాలకు, యితర రచనలకు రచయిత, ప్రముఖ సాహిత్య విమర్శకుడు అయిన డా. విశ్వంభర్‌నాథ్ ఉపాధ్యాయ; ఉర్దూలో ప్రత్యేకించి **ఇన్‌క్విలాబ్ కె దేశ్ మే** పేర రాసిన సచిత్ర యాత్రానుభవాలతో సహా భారత-సోవియట్ మైత్రిని పెంపొందిం చేందుకై చేసిన మొత్తం పాత్రికేయ కృషికి మిలాప్ సంపాదకుడు నవీన్‌సూరి; **కల్‌కతాయ్ అమీ ఓ అమర్ థియేటర్** (గెరాసిమ్ లేబెదెవ్ జీవితచరిత్ర) ను సంకలనం చేసి, సంపాదకత్వం నెరపినందుకు విదుషీమణి, సాంస్కృతిక కార్యకర్త అయిన శ్రీమతి టాంద్రా చక్రవర్తి; **ఇందిరా ప్రియదర్శిని** అనే గ్రంథ రచనకు శ్రీ.కె.ఎల్.కౌల్; రచయితలకు, మేధావులకు గోర్కీ రాసిన లేఖలను **గోర్కీ అప్నే ఖతూత్ కె ఆయనేమే**ం అనేపేర ఉర్దూలోకి అనువదించినందుకు శ్రీ నజీరుల్ హసన్ అన్సారీ; **మయకోవ్‌స్కిదియా కవితావా** అనేపేర మయకోవ్‌స్కీ కవితలను పంజాబీలోకి అనువదించినందుకు శ్రీ హర్‌భజన్ సింగ్ హుందాల్; రష్యన్‌భాషలో **భారతదేశం** అనేపేర సచిత్ర ఆల్బంకు సంపాదకత్వం నిర్వహించడం ద్వారా భారత-సోవియట్ మైత్రిని పెంపొందించినందుకు శ్రీమతి కె. శరణి మాథుర్ — వీరు విజేతలుగా బహుమతులు అందుకున్నారు.

"సోవియట్, భారత సాంస్కృతికోత్సవాలు" అనే యితివృత్తంపై వర్ణచిత్రరచనలో విజేతలైన ఐదుగురు బాలల్లో యిద్దరు — కుమారి నిషితాజైన్ (కులాచి హన్స్‌రాజ్ మాడల్‌స్కూల్, న్యూఢిల్లీ), మాస్టర్ మయాంక్ చావ్లా (బాలభారతి పబ్లిక్ స్కూల్, న్యూఢిల్లీ) యీ సభలో వున్నారు.

బహుమతుల ప్రదానం ముగిసింతర్వాత శ్రీ.కె.సి.పంత్, వి.ఇసాకవ్, డా. పౌలస్‌మార్ గ్రిగోరియస్, ఎ. అదామవిచ్, శ్రీ.టి.ఎన్.కౌల్‌లు ప్రసంగించారు.

### శ్రీ కె.సి.పంత్ ప్రసంగం

ఈరోజు మధ్యాహ్నాం యిక్కడ గడపడం, యీ యేడాది సోవియట్‌భూమి నెహ్రూ బహుమతులను నేను ప్రదానం చేయడం నాకెంతో ఆనందదాయకంగా వుంది. ప్రపంచవ్యాప్త, ప్రాంతీయ, ద్వైపాక్షిక విషయాలపట్ల యేకాభిప్రాయాల ప్రాతిపదికపై భారతదేశం, సోవియట్ యూనియన్‌ల మధ్య మైత్రి బలంగా నెలకొంది; యీ మైత్రి కాలపరీక్షకు తట్టుకొని నిల్చింది. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, శ్రీమతి ఇందిరాగాంధీలు యీ బాంధవ్యాన్ని పెంచిపోషించారు. యిది శ్రీ రాజీవ్

నాయకత్వాన పెంపొందుతోంది. భారతదేశం, సోవియట్‌యూనియన్‌ల మధ్య మైత్రి యీ ప్రాంతంలోనేగాక మొత్తంమీద ప్రపంచంలో స్థిరత్వానికీ, శాంతికీ ఒక ప్రధానాంశంగా వుంది.

ఈ యేడాది ప్రదానం చేసిన **సోవియట్ భూమి** నెహ్రూ బహుమతులకు ప్రత్యేక ప్రాముఖ్యముంది. భారతదేశమంతటా యేడాది పాటు పండిట్‌నెహ్రూ శతజయంతి జరుపు తున్నట్టు మీకందరికీ తెలుసు. యీ వేడుకలకు నిన్న భారత రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు.

జవహర్‌లాల్‌నెహ్రూ గొప్ప దేశభక్తుడు, దేశ నిర్మాత, అంతర్జాతీయవాది. ఆయన ఆలోచనలు తనదేశ, తనకాల అవధులను అధిగమించి పోయాయి. ఆయన మొత్తం మానవాళినంతట్నీ ఒకే కుటుంబంగా భావించారు; మానవ మాన్యత, దేశాల సమానతల ప్రాతిపదికపై ఒక నూతన ప్రపంచ వ్యవస్థను నెలకొల్పేందుకు భారతదేశ పలుకుబడిని, తనసొంత పలుకు బడిని, తనవ్యక్తిత్వ పటిమను, వినియోగించ డానికి ప్రయత్నించారు. అలీనవిధానాన్ని శాంతియుత సహజీవనాన్ని పంచశీలను, అణ్వస్త్ర నిరాయుధీకరణను గురించిన



ఆయన భావాలు 1950 లలో కొన్నివర్గాల్లో సందేహాలను రేకెత్తించాయి. అవి యిప్పుడు మాత్రమే విస్తృతామోదం పొందుతున్నాయి. అంతేగాక, అవి ప్రస్తుత అంతర్జాతీయ వుద్రి క్తలను వుపశమింప జేసేందుకు కూడా గణ నీయంగా తోడ్పడ్డాయి. యుద్ధానికిపూర్వం ఆయన సోవియట్‌యూనియన్‌ను సంద ర్శించి, అక్టోబర్ మహావిప్లవాన్ని గురించి, దానికిగల శక్తి సామర్థ్యాలను గురించి ఒక అభిప్రాయాన్ని యేర్పరచుకున్నారు. భారత రాజకీయ వ్యవస్థ సోవియట్ వ్యవస్థకు భిన్నంగా వున్నప్పటికీ, వుభయదేశాల ప్రజల మధ్య వుమ్మడి ప్రయోజనాలు, ఆకాంక్షలు యెంతో విస్తృతంగా వున్నట్టు నెహ్రూ గమనించారు. స్థిరత్వానికీ, శాంతికీ సోవియట్ యూనియన్‌తో మైత్రి ఒక ప్రధానాంశమనేది ఆయనకుండిన ప్రపంచదృక్పథం. భారత దేశ ప్రభుత్వరంగంలోని మౌలికపరిశ్రమలకు నెహ్రూ పునాదులు వేయగా, సోవియట్ యూనియన్ అనేక రంగాల్లో సాంకేతిక, ఆర్థిక సహాయం అందించింది. యీనాడు వుక్కుక ర్మాగారాలు, యింజనీరింగ్ పరిశ్రమల సంస్థలు, రక్షణ సంబంధ ఫ్యాక్టరీలు, యితర కర్మాగా రాది సంస్థలు మనకున్నాయి. యివి భారత, సోవియట్ ప్రభుత్వాల, ప్రజల మధ్య గల సహకార, సహృదయ శాశ్వత సంబంధాలకు తార్కాణం సోవియట్ సాంకేతిక, ఆర్థిక సహాయం భారతదేశప్రగతికీ, రక్షణసన్నద్ధతకూ, జాతీయ స్వావలంబనకూ గణనీయంగా దోహదం చేసింది.

కొద్ది రోజుల్లో అధ్యక్షుడు గోర్బచేవ్ భారత దేశాన్ని సందర్శించనున్నారు. సోవియట్- భారత మైత్రి మరింతగా వికసించే పరిణామంలో మరొక ప్రధానఘట్టంగా యీ సందర్శనను మేము భావిస్తున్నాం. భారతప్రభుత్వం పట్ల, ప్రజలపట్ల సోవియట్‌ప్రభుత్వమూ, ప్రజలూకనబర్చే సహృదయతకు, సుహృద్భావానికి అధ్యక్షుడు గోర్బచేవ్ భారతదేశ సందర్శన ప్రతీకగా వుంది. అధ్యక్షుడు గోర్బచేవ్ రెండేళ్ళ క్రితం భారత దేశాన్ని సందర్శించారు. అదొక చరిత్రాత్మక ఘటన; ఆ పర్యటన సందర్భంగా జరిగిన చర్చలు భారత-సోవియట్ సంబంధాలకు

నూతన ప్రేరణనిచ్చాయి. యిప్పుడు భారత దేశాన్ని సందర్శించాల్సిందిగా కోరిన మీదట మా ఆహ్వానాన్ని అధ్యక్షుడు గోర్బచేవ్ అంగీ కరించారు. భారతదేశంపట్ల, భారతీయులప ట్ల అధ్యక్షుడు గోర్బచేవ్‌కు స్నేహపూర్వక భావా లున్నట్టు యిది మరోసారి రుజువుచేస్తోంది. ప్రస్తుతం ఆయన జరుపుతున్న పర్యటన, చర్చలు భారత-సోవియట్ స్నేహసహకారాల ను మరింత పటిష్టం, సంఘటితం చేస్తాయనీ, మరింత వున్నత శిఖరాలకు తీసుకెళ్తాయనీ నేను గట్టిగా నమ్ముతున్నాను.

**సోవియట్‌భూమి** నెహ్రూ బహుమతులను 1964 లో నెలకొల్పారు. సాహిత్యంద్వారా, పత్రికా రచనల ద్వారా గణనీయమైన దోహదం చేసిన, అలాగే యితర రంగాల్లో అసాధారణ సృజనాత్మక కృషి చేసిన వ్యక్తులకు యీ బహుమతులను యిస్తున్నారు. వర్ణచిత్రకళా రచనలో గొప్ప ప్రావీణ్యం చూపే బాలలకు కూడా యీ బహుమతిని యిస్తున్నారు. ప్రముఖభారతీయ, సోవియట్ రచయితలతో, ప్రసిద్ధ వ్యక్తులతో కూడిన కమిటీ యీ బహుమతులను యిస్తుంది. భారతదేశానికీ, సోవియట్‌యూని యన్‌కూ మధ్యగల సాంస్కృతిక సంబంధాల్లో యీ బహుమతులు గతరెండు దశాబ్దాల కాలంలో, ఒక ముఖ్య ఘట్టం అయ్యాయి. సాహిత్యానికీ, కళలకూ సముచితమైన దోహదం చేసిన సంస్థలను కూడా బహుమతుల యెంపికలో పరిగణనకు తీసుకుంటారు. యీ యేడాది ప్రత్యేక బహుమతులనిచ్చేందుకు నయానంసార్ ట్రస్ట్‌ను, ఉదయశంకర్ స్థాపించిన భారతదేశ సాంస్కృతిక కేంద్రాన్ని యెంపిక చేశారు.

ఈ సంవత్సరం బహుమతి గ్రహీతలంతా తమతమ రంగాల్లో విశేషకృషి సల్పారు. తమ రంగాల్లో సాధించిన విజయాలకుగానూ వారికి గొప్ప గౌరవం లభించింది. **సోవియట్‌భూమి** బహుమతుల విజేతలైనందుకు వారికి నా అభినందనలు తెలియజేస్తూ, జవహర్‌లాల్ నెహ్రూ పెంచిపోషించిన ఆదర్శాలు, విలు వల కోసం వారు తమ కృషిని కొనసాగిస్తారని విశ్వసిస్తున్నాను.

ఈనాటి మధ్యాహ్నం మీతో కలిసి గడి పేందుకూ, బహుమతుల గ్రహీతలైన ప్రముఖులను కలుసుకునేందుకూ అవకాశమిచ్చిన **సోవియట్‌భూమి** నెహ్రూ బహుమతుల కమిటీకి నా ధన్యవాదాలు. నెహ్రూ బహుమతుల కమిటీకి తమ కృషిలో అన్నివిధాలా విజయం లభించాలని నేను హృదయపూర్వకంగా కాంక్షిస్తున్నాను.

**సోవియట్ రాయబారి వి. ఇసాకవ్ ప్రసంగం**
**1988 సోవియట్ భూమి నెహ్రూ బహుమతుల ప్రదానోత్సవంలో పాల్గొనడం**



యెంతో గర్వించదగ్గ విషయంగా నేను భావిస్తున్నాను. మన వుభయదేశాల మధ్య పరస్పర ప్రయోజనకరమైన మైత్రికి మూల పురుషుడైన, భారతదేశ మహత్తర పుత్రుడైన కీ.శే. జవహర్‌లాల్‌నెహ్రూ స్మృతి సోవియట్ ప్రజలకు యెంతో ప్రీతిపాత్రమైనది. ఆయన శతజయంతి వుత్సవాన్ని మాదేశంలో విస్తృతంగా జరుపుకుంటాం.

ఈ యేడాదిబహుమతుల ప్రదానోత్సవం సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి, సోవియట్‌యూనియన్

సుప్రీంసోవియట్ అధ్యక్షవర్గ అధ్యక్షుడు అయిన మిహాయిల్ సెర్గేయెవిచ్ గోర్బచేవ్ భారతదేశాన్ని సందర్శించ బోతున్న తరుణంలో జరుగుతోందని మీకు తెలుసు. సోవియట్- భారత సంబంధాలు మరింత అభివృద్ధి చెందేందుకు వుభయదేశాల నాయకుల పరస్పర పర్యటనలు గొప్ప ప్రేరణ నిస్తున్నాయి. సమానతా, సార్వభౌమాధికారంపట్ల, ప్రాదేశిక సమగ్రతపట్ల గౌరవం, ఒండొరుల ఆంతరంగిక వ్యవహారాల్లో బేజోక్యం, పరస్పర ప్రయోజనం అనే సూత్రాలు యీ సంబంధాలకు ఆధారంగా వున్నాయి. త్వరలో జరగబోయే సోవియట్-భారత శిఖరాగ్ర సమావేశం వుభయదేశాల ప్రజల ప్రయోజనంకోసం, మన భూగోళం మీద శాంతిభద్రతల కోసం సోవియట్‌యూనియన్, భారతదేశాల మధ్య సాగుతున్న సాటిలేని స్నేహపూర్వక సహకారాన్ని మరింత పటిష్టం చేస్తుందనడంలో సందేహం లేదు.

సోవియట్ యూనియన్‌తో భారతదేశ సన్నిహిత సంబంధాలు భారతీయుల మౌలిక ప్రయోజనాలను తీర్చగలవని కీ.శే. జవహర్‌లాల్ నెహ్రూ సర్వదా భావించే వారు. వుభయ దేశాల స్నేహపూర్వక సంబంధాలను ఆయన అన్నివిధాలా పెంపొందించారు; వాటి సహకారానికిగల సృజనాత్మక శక్తిస్తోమతలను యెంతో విలువైనవిగా పరిగణించారు. భారత దేశంలో భారీస్థాయి పారిశ్రామికీకరణను ఆయన ప్రారంభించారు. ఆ పథకాలకు భిలాయ్ వుక్కుకర్మాగారం ప్రత్యక్షరూపం. యేటా నాలుగు మిలియన్ల టన్నుల వుత్పత్తి స్తోమతకు పెంచే విస్తరణ కార్యక్రమాన్ని భిలాయ్ వుక్కు కర్మాగారం 1988 అక్టోబర్‌లో పూర్తిచేసింది. "భారతదేశం, సోవియట్ యూనియన్ ప్రభుత్వాలకూ, ప్రజలకూ భారత - సోవియట్ స్నేహ సహకారాలను మరింత పటిష్టం చేయడం పట్లగల నిబద్ధతకు భిలాయ్ వుక్కు కర్మాగారం ఉజ్వల తార్కాణం" అని భిలాయ్ వుక్కు కర్మాగారం శ్రామిక సమిష్టి బృందానికి ప్రధాని రాజీవ్ గాంధీ ఆ సందర్భంగా పంపిన సందేశంలో పేర్కొన్నారు.

ఇటీవలికాలంలో మనవాణిజ్య, ఆర్థిక సహకారం స్థిరమైన పెరుగుదలను, వైవిధ్యాన్ని కనబరుస్తూ గుణాత్మకస్థాయిలో అభివృద్ధి చెందుతోంది. మన వుభయ దేశాలమధ్య సాంస్కృతిక సహకారంకూడా బహుముఖంగా అభివృద్ధి చెందుతోంది. సోవియట్ యూనియన్‌లో భారతదేశ వుత్సవం, భారతదేశంలో సోవియట్ యూనియన్ వుత్సవం గత సంవత్సరమంతా మనల్ని ఆనందింపజేశాయి. యే రెండు దేశాలమధ్యా సాంస్కృతిక ఆదానప్రదానాల రంగంలో యింతటి భారీ స్థాయిలో వుత్సవాలు జరగలేదు. అవి కేవలం నూతన ఘట్టాలు మాత్రమే కాదు; అవి సంస్కృతి, విజ్ఞాన శాస్త్రం, కళలు, క్రీడల రంగాల్లో మనమధ్య భవిష్యత్తులో ఫలప్రదమైన పరస్పర సహకారానికి సంబంధించి నూతన మార్గాలను కూడా ఆవిష్కరించాయి.

మన వుభయదేశాల మధ్య స్నేహబంధాలను పటిష్టం చేసేందుకు అన్నివిధాలా కృషి జరుపుతున్న లక్షోపలక్షలమందికి ప్రాతినిధ్యం వహిస్తున్న కొంతమందిని యీనాడు మనం సత్కరిస్తున్నాం. 1961లో జవహర్‌లాల్ నెహ్రూ యిలా చెప్పారు: "సోవియట్ యూనియన్ మనకు అనేక విలువైన కానుకలిచ్చింది; యీ కానుకల్లోకెల్లా అత్యంత విలువైనది స్నేహం." మన వుభయ దేశాల ప్రజలమధ్యగల యీ స్నేహాన్ని పరిరక్షించి అభివృద్ధిచేసే ఆశయసాధనలోనెహ్రూబహుమతులవిజేతలకు నూతన విజయాలు లభించాలని నేను ఆకాంక్షిస్తున్నాను.

సోవియట్ - భారత స్నేహాన్ని పటిష్టం చేసేందుకు **సోవియట్ భూమి** పత్రిక గొప్ప తోడ్పాటు నిచ్చిందని కూడా నేను చెప్పదల్చుకున్నాను. భారతదేశం, సోవియట్ యూనియన్‌ల ప్రజలమధ్య పరస్పర సదవగాహనను పటిష్టం చేసే, ప్రగాఢంచేసే లక్ష్యంతో కూడిన వుదాత్త కృషిలో నెహ్రూ బహుమతుల కమిటీకీ, **సోవియట్ భూమి** పత్రిక సంపాదక వర్గ

సభ్యులకూ మరిన్ని విజయాలు లభించాలని ఆకాంక్షిస్తున్నాను.

### ఎ. అదామవిచ్ ప్రసంగం

నిన్నరాత్రి నేను మాస్కో నుంచీ భారత దేశానికి విమానంలో ప్రయాణం చేస్తున్నప్పుడు మెరుపులా కొన్ని భావాలు నా మనసుకు తట్టాయి. మాదేశ సృజనాత్మక రచయితల సంఘం తరపున నా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలియజేయబోయేముందు ఆ భావాలను గురించి నేను. మీకు చెప్పదల్చుకున్నాను.

భారతప్రభుత్వం యేర్పాటు చేసిన నెహ్రూ బహుమతిని అందుకున్నవారిలో. ఒకరైన, కళాకారుడు పోప్లవ్స్కీతో నాకు యెంతో పరిచయముంది. భవిష్యత్తులో భారతదేశం బహుశా లియో టాల్‌స్టాయ్‌పేరిట బహుమతులు యేర్పాటు చేసి సోవియట్ మేధావులకు యిచ్చినా ఆశ్చర్యపడాల్సిందేమీ వుండదేమో అనిపించింది నాకు.

సాంస్కృతిక ఆదాన ప్రదానాలు యీనాడు యెంతో వుపయుక్తంగా వున్నాయి. మా మనసుల్లో వున్నది పాదార్థిక ఆదాన ప్రదానాలంతటి, ముఖ్యమైనవైన ఆత్మిక ఆదాన ప్రదానాల విషయం. ఢిల్లీ ప్రకటనపై సంతకాలు చేసిన తర్వాత మా నాయకుడు మిహాయిల్ గోర్బచేవ్ మాస్కోకు తిరిగివచ్చి, అహింస అనే భావనను, పూర్తిగా సరికొత్తదైన, ఆదర్శ ప్రాయమైన భావనను మాకు కానుకగా యిచ్చినప్పుడు యిలాంటి ఆత్మిక ఆదాన ప్రదానాలకు తార్కాణం లభించింది మాకు. యీ భావన వుభయదేశాల మధ్య బాంధవ్యానికి సంకేతంగా మాత్రమే గాక, ప్రపంచ రాజకీయాలకు నూతన సూత్రం కూడా. యెవరైనా మీ దేశానికి వస్తున్నప్పుడు తనకు నిజంగా వున్న తెలివి తేటలకన్నా యెక్కువ తెలివితేటలు గల వ్యక్తిగా వుండాలనిపిస్తుంది.



భారతదేశంలో మొలకెత్తిన అహింసాభావన యూరప్‌లో పాదుకుని, అక్కడ పెరిగి, ఆ ఖండంలోని ప్రత్యేక పరిస్థితుల్లో మరింత సంపన్నవంతమయింది.

ఈ యేడాది నెహ్రూ బహుమతుల విజేతలకు తమ వుదాత్త కృషిలో మరిన్ని విజయాలు ఆకాంక్షిస్తున్నానని మనవి చేసుకుంటూ ముగిస్తున్నాను.

### డాక్టర్ పౌలస్ మార్ గ్రిగోరియోస్ ప్రసంగం

ఈనాటి నాకర్తవ్యం సంతోషకరమైనదీ, సులభమైనదికూడా. **సోవియట్ భూమి** నెహ్రూ బహుమతుల కమిటీ యీరోజు మాకిచ్చిన గౌరవానికి బహుమతుల విజేతలందరి తరపునా మా కృతజ్ఞతలు, ప్రశంస వ్యక్తం చేయడం నావంతు.

సంస్థలకు, వ్యక్తులకు, బాలబాలికలకు యిచ్చిన యీ బహుమతి ఒక గుర్తింపు. మానవాళి సేవకోసం మేము జరిపే కృషిని ద్విగుణీకృతశక్తితో కొనసాగించడానికి మాలో ప్రతి ఒక్కరికీ యిది ప్రోత్సాహాన్ని కలిగిస్తోంది. యిలాంటి గుర్తింపును, ప్రోత్సాహాన్ని మాకిచ్చినందుకు ప్రగాఢమైన, చిత్త శుద్ధితో కూడిన మా కృతజ్ఞతలను కమిటీకి తెలియజేయాల్సిందిగా నా మిత్రుడు, రాయబారి అయిన టి.ఎన్.కౌల్‌ను మా అందరి తరపునా అభ్యర్థిస్తున్నాను.

### శ్రీ టి.ఎన్. కౌల్ ప్రసంగం

ఈ సభకు విచ్చేసినందుకు మీకందరికీ

యెంతో సంతోషంతో కృతజ్ఞతలు తెలియ జేస్తున్నాను. యీ సంవత్సరపు బహుమతుల విజేతలకు నా హృదయపూర్వకమైన అభినందనలు.

ఈనాటి సభకు రెండు విధాలుగా ప్రాముఖ్యముంది. యెందుకంటే, యీ బహుమతులను భారతదేశ మహత్తర వ్యక్తి అయిన జవహర్‌లాల్ నెహ్రూ పేరిట యేర్పాటు చేయడం జరిగింది. ఆయన శతజయంతి వుత్సవాలు ప్రారంభమైన తరుణంలో, మన దేశాన్ని అధ్యక్షుడు మిహయిల్ గొర్బచేవ్ సందర్శించబోతున్న సమయంలో యీ సభ జరిగింది.

**సోవియట్ భూమి** పత్రిక యిటు సోవియట్ ప్రజలకూ, అటు భారతప్రజలకూ మధ్య మరింతగా సదవగాహనను పెంపొందించడంలో ప్రశంసనీయమైన సేవచేసింది. యిదే ఆదర్శాన్ని మాస్కోలో నెలకొల్పడానికి మేము ప్రయత్నించాం. కానీ, రష్యన్ భాషలో మాత్రమే వెలువడే మన పత్రిక **ఇండియా** ప్రతులసంఖ్య అరవై వేలకు మాత్రమే పెంచ గలిగాం. అతిత్వరలోనే రాబోయే రిపబ్లిక్ దినోత్సవానికిముందే సోవియట్ ప్రభుత్వం, ప్రజల సహకారంతో మాస్కోలో భారతీయ సాంస్కృతిక కేంద్రాన్ని నెలకొల్పబోతు న్నందుకు సంతోషిస్తున్నాను. మన చరిత్ర, సంస్కృతి, నృత్యం, సంగీతం, నాటకరంగాల పట్ల సోవియట్ ప్రజలకు కలిగిన గొప్ప ఆసక్తిని పెంపొందించాలని ఆశిస్తున్నాం. తాష్కెంట్‌లో దీని శాఖనొకదాన్ని పరస్పరప్రాతి పదికపై కొన్ని ప్రముఖ సోవియట్ విశ్వవిద్యా లయాల్లో భారతీయ విషయాధ్యయన విభాగా లనూ నెలకొల్పాలనికూడా ఆశిస్తున్నాం.

భారతదేశంలో జరుగుతున్న సోవియట్ యూనియన్ వుత్సవాల ముగింపు వేడుకల్లో పాల్గొనడానికి వచ్చిన సోవియట్ కళాకారులిచ్చిన సంగీత, నృత్య ప్రదర్శనలతో యీ సభ సమాప్తమైంది.



ఆధునిక కాలంలో నూతన ఆలోచనా ధోరణి

# కొత్త నమూనా సోషలిజం కోసం సమిష్టి అన్వేషణ

**సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ తాలూకు ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎకనామిక్స్ ఆఫ్ వరల్డ్ సోషలిస్ట్ సిస్టం డైరెక్టర్ అకడమీషియన్ అల్యేక్ బొగొమొలోవ్ ఇచ్చిన ఇంటర్వ్యూ.**

ప్రశ్న: గత కొన్ని సంవత్సరాల్లో సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాల్లో వివిధ భావజాల, రాజకీయ ధోరణులు తలెత్తాయి. అభిప్రాయాలు స్పష్టంగా విభజితమౌతున్నాయి. ఈ ధోరణికి కారణాలేమిటి?

జవాబు: నూతన ఆలోచనా ధోరణిలో, ఎంచుకునే స్వేచ్ఛ భావన అగ్రగామి పాత్ర నిర్వహిస్తోంది. ఇలాంటి ఈ నూతన ఆలోచనా ధోరణిని చేపట్టడమే మీరు చెప్పిన పరిణామానికి ప్రధాన కారణమనుకుంటున్నాను. "మానవాళి మనుగడే ప్రపంచ ప్రప్రథమ సమస్యగా పరిణమించిన మనకాలం లోని అంతర్జాతీయ సంబంధాలకు చెందిన ఈ సూత్రం సార్వ జనీన మైనదని మన నమ్మకం. పెరుగుతున్న కనీవినీ ఎరుగని యీ ప్రపంచ వైవిధ్యం నుంచీ యీ భావన ఉద్భవించింది." అని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గొర్బచేవ్, యిటీవల జరిగిన కమ్యూనిస్టు పార్టీ సమావేశంలో చెప్పారు.

"యుగాల తరబడిగా ప్రపంచ చరిత్రపై ఎలాంటి ప్రభావమూ నెరపని కోటానుకోట్ల ప్రజలు యిప్పుడు ప్రపంచ చరిత్ర సృష్టిలో క్రియాశీలంగా పాల్గొంటున్నారు" అని ఆయన అన్నారు.

ప్రపంచ సోషలిజం కష్ట భూయిష్టమైన మూల మలుపులో ఉందని ఈ సమావేశం ప్రకటించింది. అయితే, సోషలిస్టు ప్రపంచంలోని అతి తీవ్రమైన వైరుధ్యాలు కూడా శత్రు వైరుధ్యాలుగా పరిణమించవు.

సోషలిజంలో భిన్నతరగతులవారి ప్రయోజనాలు సదా ఉంటూండినప్పటికీ చాలాకాలంపాటు వాటిని విస్మరించడమో, కృత్రిమంగా అణచి వేయడమో జరిగింది. అదిప్పుడు బయటికి వస్తోంది. మార్పులు వస్తున్న ఈ కాలం మన మనేక విషయాలను సమీక్షించుకునేలా చేస్తోంది.

ప్రశ్న: సోషలిస్టు దేశాల్లోని భావజాల, రాజకీయ పరిస్థితిలో గొప్ప భిన్నత్వం ఉంది.

# కొత్త నమూనా సోషలిజంకోసం సమిష్టి అన్వేషణ

కొన్ని అభిప్రాయాలు అధికార విధానానికి సన్నిహితంగా ఉండగా మిగిలినవి, అసలు సోషలిజంతోనే తెగతెంపులు చేసుకోవాలని కొందరు డిమాండ్ చేసేటంత తీవ్రంగా ఉంటున్నాయి. అధిక ప్రాబల్యం గల ధోరణులేమన్నా ఉన్నాయా?

జవాబు: ఉన్నాయనుకుంటున్నాను. వాటిలో అతి బలమైనది పునర్నవీనీకరణోద్యమం. అది అంతకంతకూ బలపడుతోంది. సోషలిజాన్ని గురించిన లెనిన్ భావనను పునరుద్ధరించి, సమస్త సమాజ సంబంధాలనూ మౌలికంగా పునర్వ్యవస్థీకరించి కొత్త తరహా సోషలిజాన్ని సృష్టించాల్సిన అవసరముందనుకునే వారందరినీ ఇది ఐక్యపరుస్తోంది.

గ్లాస్నోస్త్, వాస్తవికత, ఉన్నత నైతిక సూత్రాలపై విధానం ఆధారపడి ఉండాలి, ప్రతిపౌరుడూ సామాజిక జీవితంలో క్రియాశీలంగా పాల్గొనడానికి వీలుగా అతనికి స్వేచ్ఛ ఉండాలి, అన్నది పునర్నవీనీకరణ సమర్థకుల డిమాండ్. ఈ సంస్కరణోద్యమంలో కూడా ఒక మోస్తరు సంస్కరణనుంచీ, మౌలిక సంస్కరణను కోరడం దాకా గల రకరకాల అభిప్రాయాలున్నాయి. అంతేకాదు. అరకొర చర్యలు మనం కోరే ఫలితాలివ్వవనే, విప్లవాత్మక మార్పులు అవసరమనే అభిప్రాయం వైపు సోషలిస్టు ప్రపంచంలోని భావజాల, రాజకీయ జీవితం క్రమంగా ''మొగ్గు'' చూపనారంభిస్తోంది.

అదే సమయంలో పాత ప్రభుత్వ పద్ధతులనూ, పాత జీవన సరళులనూ కాపాడాలని కోరే ధోరణి కూడా కనిపిస్తోంది.

సోషలిజాన్ని సంస్కరించాల్సిన అవసరముందని అంగీకరిస్తూనే, సంస్కరణవాద పదజాలాన్ని సైతం వాడుతూనే, ఎంతో ఆకర్షణీయమైన ముసుగులో పాత వారసత్వాన్నీ ఆదేశపూర్వక ప్రభుత్వ పద్ధతులనూ ఈ ధోరణికి చెందినవారు కాపాడయత్నిస్తున్నారు. యిలా చేయడంలో వారు పాతతరహా పిడివాదాలనూ, గతానుగతిక వాదాలనూ పట్టుకొని వేలాడుతున్నారు; మార్క్సిజం - లెనినిజం పవిత్రత పట్ల బూటకపు ఆందోళన కనబరుస్తున్నారు. అలాంటి వారు సిద్ధాంతం, ఆచరణ రంగాల్లో జరిగిన తప్పులనూ, వాటిల్లిన వైఫల్యాలనూ అంగీకరించడానికి సిద్ధపడటం లేదు. చారిత్రక సత్యాన్నీ, ప్రాథమిక న్యాయాన్నీ పునః స్థాపించే ప్రయత్నం చేసినప్పుడల్లా వారు ''జరిగిందేదో జరిగింది, పోనివ్వండి'' అని అంటున్నారు. పునర్నవీనీకరణ క్రమంగా విప్లవ స్థాయికి చేరుకుంటుందేమోనని భయపడే బ్యూరాక్రటిక్ యంత్రాంగం ప్రయోజనాలను యీ ధోరణి కాపాడుతోందనేది నిస్సందేహం.

సోషలిస్టు ప్రపంచంలో సైద్ధాంతిక ఛాయా భేదాలున్న యితర ధోరణులనేకం ఉన్నాయి: కొన్ని జీవ్యావరణ సమస్యల పై దృష్టి కేంద్రీకరిస్తున్నాయి; మిగిలినవి న్యాయ శాస్త్ర సమస్యల పైన, యింకా మిగిలినవి జాతి, మత తదితర సమస్యలపైన యిలా....కేంద్రీకరిస్తున్నాయి.

ప్రశ్న: అధునిక సాంకేతిక, సాంస్కృతిక సమాచార రంగాల్లోని విప్లవకర మార్పులకు అనుగుణమైన ఒక కొత్త నమూనా సోషలిజానికై జరుగుతున్న సమిష్టి అన్వేషణను గురించి మీరు ఇటీవల ఒకవ్యాసం రాశారు. అది నూతన ఆలోచనాధోరణి కోసం, ప్రజాస్వామ్యీకరణ కోసం కొత్త స్థాయిలో అంతర్జాతీయ పరమైన పరస్పరభావ ప్రకటన కోసం అన్వేషణ. కాని కొందరు ''సోషలిజం నమూనా'' అనే మాటకే అభ్యంతరం తెల్పుతున్నారు కదా...

జ: ఒకప్పుడు, బూర్జువా రాజకీయ శాస్త్రజ్ఞులు,

"సోషలిజం తాలూకు జాతీయ నమూనాలు" లేదా "కమ్యూనిజం తాలూకు సోషలిజం నమూనాలు'' అన్న భావనను తరచువాడుక లోకి తెచ్చారు. సోవియట్ అనుభవంలోని కొన్నిఅంశాలకు సార్వత్రిక ప్రాధాన్య ముందన్న అభిప్రాయాన్ని అప్రతిష్ట పాలు చేయడం దాని ఉద్దేశం. అటు వంటిభావనల్లోనిరాజకీయ అంతరార్థం స్వయం విదితమే. దాన్ని నిశితంగా విమర్శించడం జరిగింది. అందువల్ల, "నమూనా" అనే పదం పట్ల దురభిప్రాయం ఇప్పటికీ కొంత మందికి ఉంది. యిది బూర్జువా భావజాలం నుండి అరువు తెచ్చుకున్నదని వారనుకొంటున్నారు. కాని, "జాతీయ నమూనాలన్న" భావంపై తీవ్ర విమర్శలు మనల్ని మరో కొసకులాగాయి. సోవియట్ అనుభవాన్ని విచక్షణా రహితంగా కీర్తించడం జరిగింది. క్రమక్రమంగా అది అప్రస్తుతమూ, సైద్ధాంతికంగానూ, రాజకీయంగానూ హానికరమూ అయింది. మనదేశం స్తబ్దతలో కూరుకపోవడంతో, సోషలిస్టు సూత్రాలు, విలువలూ వక్రీకృతమై, ఆదర్శానికి, వాస్తవానికీ మధ్య అఖాతం పెరిగింది.

అంతేకాదు. 20 ఏళ్ళ క్రితం ''జాతీయ నమూనాల''పై జరిగిన చర్చ అనిర్దిష్టమైనది. 1940 ల చివరిలోనూ, 1950 ఆరంభంలోనూ ఇతర సోషలిస్టు దేశాలతో సోవియట్ యూనియన్ సంబంధాల చరిత్రనుంచీ ''చేదు'' వాస్తవాలను ఉద్దేశ పూర్వకంగానే తొలగించారు. సోవియట్ అనుభవాన్ని- దాని విజయాలను, తప్పులను, సోషలిజం నుంచి వైదొలగిన పెడ ధోరణులనూ — యాంత్రికంగా అనుకరించడం జరగలేదని భావించారు. కాని, ఇది యదార్థం కాదు. ఈ ప్రచార ఫలితంగా, తమ దేశాల్లో సోషలిజాన్ని నిర్మించే కృషిలోని ప్రత్యేక లక్షణాలను పరిశీలించడానికి ఏశాస్త్రజ్ఞుడైనా ప్రయత్నిస్తే, అతణ్ణి, అనుమానించే వారు కాబట్టి, క్లిష్టమైన ఈ ముఖ్య సమస్యను అధ్యయనం చేసే వారే క్రమక్రమంగా కరువయారు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ పెరిస్ట్రోయికా విధానాన్ని చేపట్టినప్పుడు, ప్రతి కమ్యూనిస్టు



## ఓ. బొగోమొలోవ్

పార్టీ అనుసరించే విధానం విషయంలో తన దేశప్రజలకే జవాబుదారీ అని అది ప్రకటించింది. సత్యమనేది సోవియట్ కమ్యూనిస్టుపార్టీతో సహా ఏపార్టీ గుత్తసొమ్మూ కాదు. సోవియట్ యూనియన్‌కు ఏ దేశంపైనా తన విధానాన్ని రుద్దే హక్కులేదు. పైపెచ్చు ఇతర సోషలిస్టు దేశాల ఆచరణాత్మక విజయాలను వినియోగించడానికి మనం ప్రయత్నిస్తున్నాం. ఆ దేశాల ప్రజలు సోవియట్ యూనియన్‌లో వస్తున్న మార్పులను ఆసక్తితో గమనిస్తున్నారు. సోవియట్ నమూనానుంచి వైదొలగడం సోషలిజానికే అపచారంగా బావిస్తూ, ఆ దేశాన్ని ''వెలివేసే'' రోజులు గతించాయి.

ప్రశ్న: సోషలిజం అనేది ఒకే సామాజిక వ్యవస్థ కాబట్టి, దాని నిర్దిష్ట లక్షణాలు అంతటా ఒకే విధమైనవి కాబట్టి, సోషలిజానికి నమూనా ఒకే ఒకటి ఉంటుందని చాలా కాలంగా నమ్ముతూ వచ్చారు. ఈ నూతన సమాజ ప్రధాన లక్షణాలను తార్కిక దృష్టితో ముందుగా ఊహించడమే గాక, వాస్తవం కూడ వాటిని ధ్రువ పరచిందని చెప్పేవారు.

ముందుగానే ఏర్పరచుకొన్న భావనల ప్రకారం

# కొత్త నమూనా సోషలిజం కోసం సమిష్టి అన్వేషణ

సోషలిజాన్ని నిర్మించడం టెక్నోక్రాట్ల పాలన, లేదా హుకుందారీ పాలనవంటి దుష్ఫలితాలకు దారి తీస్తుందని మీరనుకోవడం లేదా? ఫలితంగా ప్రచారం కేవలం నీతులు వల్లించడంగా, లేక మనిషి చైతన్యాన్ని వంచనతో లోబరచుకోవడంగా, సామాజిక శాస్త్రాలు పిడి సూత్రాలుగా దిగజారిపోవడం తప్పదు కదా?

**జవాబు :** మీతో నేను ఏకీభవిస్తున్నాను. నూతన వ్యవస్థను గురించిన కరుడు గట్టిన భావాలు, అటువంటి సైద్ధాంతిక నియంతృత్వ ఫలితమే. అలా కాక వాస్తవం నుంచీ, గత గుణపాఠాలనుంచీ నిర్ధారణలు చేయడం వల్ల, సోషలిజం ఏకొత్త దాన్నైనా ఇముడ్చుకో గల నమూనా అవుతుంది. దాని పునాదులు మాత్రమే మారవు. అవేమిటంటే ఉత్పత్తి సాధనాల నుంచీ, రాజ్యాధికారం నుంచీ మనిషి వేర్పాటును అధిగమించడం, శ్రామికుల ప్రయోజనాల కోసం వారి ప్రత్యక్ష భాగస్వామ్యంతో సమాజ వ్యవహారాలు నిర్వహింపబడటం, సామాజిక, జాతీయ న్యాయం ఉండటం వ్యక్తి సృజన శక్తులకు ప్రోత్సాహం కల్పించటం.

సామాజికన్యాయంపై ఆధారపడిన సమాజాన్ని 'పౌరులందరికీ స్వేచ్ఛా, సమానతగల నాగరికతను నిర్మించడం సాధ్యమని నిరూపించిన మార్క్సిస్టు - లెనినిస్టు బోధల జీవశక్తిని ప్రస్తుత పెరిస్త్రోయికా విధానం ధ్రువపరుస్తోంది.

ప్రశ్న: సోషలిజం తాలూకు మునుపటి నమూనాలోని అవకాశాలు అనేక దేశాల్లో పూర్తిగా హరించుక పోయాయనే అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తున్నారా?

**జవాబు :** సామాజిక ఉత్పత్తిని నడిపే ప్రస్తుత పద్ధతులు తగినంత ఫలప్రదంగా లేవనీ, ఆధునిక ఉత్పాదక శక్తుల అభివృద్ధి అవసరాలకు అవి స్పందించడం లేదనీ అనుభవంలో తేలింది.

1970 ల చివర్లో సోషలిస్టు దేశాల్లో అధిక భాగానికి తీవ్ర ఆర్థిక సమస్యలు ఎదురయ్యాయి. సోషలిస్టు సమాజం తన్నుతాను నియంత్రించుకుంటూ, తన్నుతాను మెరుగుపర్చుకొనే వ్యవస్థను మునుపటి నమూనా సృష్టించలేదు. కాబట్టే వైరుధ్యాలు పెచ్చరిల్లి కొన్ని సందర్భాల్లో సంక్షోభాలకు కూడ దారితీసింది.

ప్రశ్న: సంక్షోభం, ఎవరో నాయకుని తప్పిదాల వల్ల యాదృచ్ఛికంగా కలిగిన తాత్కాలిక వైఫల్యమని చాలాకాలంగా అనుకుంటూ వచ్చారు. వైరుధ్యాల, ఘర్షణల తీవ్రతకు కారణం వర్గపోరాట తీవ్రతా, సామ్రాజ్యవాద ప్రచారం మొదలైన బాహ్యాంశాలూ అని చెబుతూ వచ్చారు. వీటిని ఉపేక్షించ లేముకాని, మన వైఫల్యాలన్నిటికీ ఇవే కారణమని చెప్పడం వల్లనే, మన సమాజంలో పెరుగుతున్న ఉద్రిక్తతను ముందుగా కనిపెట్టే ఒక వ్యవస్థను సృష్టించలేక పోయాముకదా?

**జవాబు :** ఔను. అందువల్లనే అనేక సోషలిస్టు దేశాల సంక్షోభ పరిష్కారానికి చాలా ఆలశ్యంగా పూనుకొన్నారు; అప్పటికి సంస్కరణలను అమలు జరపడం కష్టమైపోయింది. చిక్కు పరిస్థితులు సంభవించాయి. వీటన్నిటికీ పెరిస్త్రోయికా కారణమని యధాతథ వాదులు చెప్పారు; ఇప్పుడూ చెబుతున్నారు.

సోషలిజం తాలూకు కొత్త నమూనాకోసం అన్వేషణ పురోగమన మార్గాల అన్వేషణే అది ప్రారంభమైంది, అంతర్జాతీయ పరిమాణాల నందుకొంది. ఈ అన్వేషణ చాలా కష్టమైనదీ, సుదీర్ఘమైనదీ. తప్పులు చేయడం తప్పదు. మన నిర్ణయాలను మరీమరీ సమీక్షించుకుంటూండాలి. సంస్కరణ అనేది నిరంతరమైన సమాజ స్వయం పునర్నవీకరణ క్రమమని అది పాత, కొత్తల ఘర్షణ అనీ సమాజం గుర్తించడం ముఖ్యం.

# నరవర్గ బృందాల సమస్యా: పెరిస్త్రోయికా

అకడమీషియన్
యులియన్
బ్రోమ్లీ
డైరెక్టర్,
యు ఎస్ ఎస్ ఆర్
విజ్ఞాన శాస్త్రాల అకాడమీ
ఎత్నోగ్రఫీ ఇన్‌స్టిట్యూట్



ఇటీవలిదాకా, పండితులకూ, సాధారణ ప్రజలకూ జాతుల సమస్య తగ్గుముఖం పట్టిందన్న నమ్మకముండేది. అయితే, అది తప్పని పరిణామాలు నిరూపించాయి. ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, శ్రీఘ్రతర పురోగమనం, సమాచారం, విలువల ముమ్మర ఆదాన ప్రదానాలు, తదితర సంబంధాలు ప్రపంచ వ్యాప్తంగా జాతీయ చైతన్యాన్ని పెంచి పోషిస్తూ ఉన్నాయి.

అల్మా అతా ఘటనలు, క్రిమియన్ తాతార్‌ల డిమాండ్లు, బాల్టిక్ రిపబ్లిక్కుల్లో ప్రదర్శనలు నగోర్నీ కరబాహ్ వ్యవహారం— వీటన్నిటిని బట్టి యిది ప్రత్యేకించి సోవియట్ యూనియన్ విషయంలో నిజం. యిదంతా ప్రజలకు దిగ్భ్రాంతి కలిగించింది. వారిప్పుడు, మనదేశంలో సాగుతున్న నరవర్గ క్రమాలను గురించిన మన పాత అభిప్రాయాన్ని పునః పరిశీలించుకుంటున్నారు. విచారకరమైన విషయమేమంటే కొన్ని సమయాల్లో మనం ఒక కొననుండీ మరొక కొనకు వెడుతున్నాం.

జాతుల విషయంలో లెనిన్ విధానాన్ని అమలు జరపడంలో మనం సాధించిన సత్ఫలితాలను గురించి, కొందరు అనుమానాలు వెలిబుచ్చుతున్నారు. అల్ప సంఖ్యాక జాతుల సామాజిక, ఆర్థిక బడుగుతనాన్ని అతిస్వల్ప కాలంలో అధిగమించడం, ఎక్కువ అభివృద్ధి చెందిన జాతులు తమకన్నా తక్కువ అభివృద్ధి చెందిన యిరుగుపొరుగు జాతులకు నిస్వార్థంగా సహాయం చేయడం, సమస్త జాతుల సంస్కృతులూ అభివృద్ధి చెందడమూ సోషలిస్టు జీవన విధానంలాంటి లెనిన్ జాతుల విధాన సత్ఫలితాలను చూడకుండా ఉండటం కష్టం.

జాతుల రంగంలో ఇటీవలి వ్యతిరేక పరిణామాలకు కారణం పెరిస్త్రోయికాయేనని కొందరంటున్నారు. ఇది ప్రమాదకరమైన భ్రమ. పెరిస్త్రోయిక్కా, బాహాటతలకు ముందు ప్రతికూల విషయాలను ముఖ్యంగా జాతుల విషయంలోని వాటిని గురించి మనకు చెప్పలేదు.

నేటి జాతుల ఘర్షణకు మూలాలు స్టాలిన్ వ్యక్తి పూజలో ఉన్నాయి. ఆయన ప్రజాస్వామ్యాన్నీ అంతర్జాతీయతను, లెనిన్ జాతుల విధానాన్నీ వక్రీకరించారు. జాతులను కబళించడాన్ని మాటల్లో వ్యతిరేకించారు. కాని, దేశంలో యిప్పుడు 120 కి పైగా జాతులుండగా 60 మాత్రమే ఉన్నట్టు చెప్పారు. 1920ల చివర్లో జాతీయ జిల్లాలు, జాతీయ గ్రామీణ సోవియట్లు లాంటి 5,000 పరిపాలనా యూనిట్లూ, సోవియట్లను రద్దు చేశారు.

బ్రెజ్నేవ్ పాలనా కాలంలో పరిస్థితులు మరింత అధ్వాన్నమయ్యాయి. 1970 లలోను,1980 ల ఆరంభంలోను కొన్ని రిపబ్లిక్కులు, ఫెడరల్ ఆర్థిక అభివృద్ధికి ఇచ్చే నిధులను తగ్గించాయి. అనేక ప్రాంతాలు పరాన్నభుక్కు ధోరణులకు అలవాటుపడిపోయాయి. కొన్ని రిపబ్లిక్కులు మంచి సామాజిక, సాంస్కృతిక ఆధార రంగంతో పురోగమిస్తుండగా, మిగిలినవి దారుణంగా వెనక బడుతూండినాయి. నరవర్గకారకాన్ని సొమ్ము చేసుకొనే ప్రయత్నంలో భాగంగా తమకు ప్రాథమ్యమివ్వాలని కొన్ని మండలాలు పట్టుబట్టాయి. సామాజిక, దైనందిన సమస్యలు అంతర్ జాతి సంబంధాలకు హాని కలిగించాయి. అంతర్జాతీయతను మాటల్లో సమర్థిస్తూ, కొన్ని రిపబ్లిక్కుల "అధినేతలు" జాతీయ వేర్పాటు తత్వాన్ని పెంచారు.

అంతర్‌జాతి సంబంధాల్లోని అంతర్గత ఉద్రిక్తతా ఆలవాలాలను ప్రజాస్వామ్యీకరణ బయట పెట్టింది. యిది జాతుల సమస్యను స్వార్థానికి వాడుకొనేవారి ప్రయోజనాలను దెబ్బతీసింది.

అంతర్‌జాతి సంబంధాల్లో సామాజిక న్యాయం అమలు జరిగేలా చూడటానికి పెరిస్త్రోయికాలో సమస్త నరవర్గబృందాలూ, మండలాలూ పాల్గొనడం అవసరం.

నరవర్గాల పరిపాలక వ్యవస్థల విషయంలో మనం మరింత పట్టు విడుపులతో కూడిన

# నరవర్గ బృందాల సమస్య: పెరిస్త్రోయికా

ధోరణినే ప్రదర్శించాలి. అల్ప సంఖ్యాకజాతి ప్రతిపత్తిని (శాసన నిర్మాణసంస్థలల్లోనూ, పరిపాలకసంస్థలలోనూ, వాటి ప్రాతినిధ్యం, మాతృభాషలో విద్యాబోధన, తన సంస్కృతి అభివృద్ధి హక్కు మొదలైనవి) రాజ్యాంగం నిర్వచించాలి. ఇలాంటి బృందాల జనాభా 55 మిలియన్లు అంటే సోవియట్ జనాభాలో 20 శాతం.

సాంస్కృతిక అంతర్జాతీయీకరణ సాగుతున్న ప్రస్తుత పరిస్థితిలో, అంతర్జాతీయీకరణ అంటే, విశ్వస్వరమేళనలో ఆయాజాతి స్వరాల మధ్య సామరస్యసాధనే తప్ప, వాటి విధ్వంసం కాదని అనతోలి లునాచరస్కీ చెప్పారు.

జాతుల సన్నిహిత సమైక్యత అంతర్జాతీయతలోని ప్రధానాంశం. ఈ ప్రాథమిక భావాన్ని ''ప్రపంచ కార్మికులారా ఏకం కండు!'' అన్న సూత్రీకరణ చక్కగా వ్యక్తం చేస్తోంది.

1917 సోషలిస్టు విప్లవం జరిగిన తర్వాత మన దేశంలోని నరవర్గ బృందాలు, ఉమ్మడి ప్రయోజనాలుగల కొత్త, ప్రజగా, సోవియట్ ప్రజగా రూపొందాయన్న వాస్తవాన్ని కల్ల అనడమంటే సోషలిస్టు అంతర్జాతీయతపై దాడిచేయడమే. సోవియట్ ప్రజలు ఒక రాజ్య పౌరులుగా ఉండటమేగాక, తమ జీవనసరళిచే, ఉమ్మడి రాజకీయాభిప్రాయాలచే, భావజాలంచే, సామాజిక, మానసిక కారకాలచే కూడా ఏకం చేయ్యబడ్డారనేది స్పష్టమే. సోవియట్ జాతులు జాతీయ చైతన్యాన్నేగాక, సమాఖ్య చైతన్యాన్నికూడా వ్యక్తం చేస్తున్నాయి. సోవియట్ పాలనాకాలంలో తమ ఉమ్మడి చారిత్రక విజయాలను గుర్తిస్తున్నాయని దీనర్థం. దేశ సమగ్ర ఆర్థిక వ్యవస్థ సోవియట్ జాతుల ఐక్యతకు పునాదిగా ఉంది.

సోవియట్ ప్రజానీకం ఒకకొత్త సమాజం అవునా కాదా అన్న సందేహం బయల్దేరడానికి మన సామాజిక శాస్త్రవేత్తలు కొంతవరకూ కారణం. వారు మన సమాజాన్ని కనీవినీ ఎరుగని ప్రత్యేకమైనదిగా చిత్రిస్తున్నారు. దాని ప్రాథమిక లక్షణాలను సరళీకరిస్తున్నారు. ఇలాంటి అంతర్ జాతి, బహుళ జాతి సమాజాలను మానవాళి చూచిందన్న వాస్తవాన్ని విస్మరిస్తున్నారు. ఇలాంటి సమాజాలు తృతీయ ప్రపంచంలోనూ, (భారత దేశం మొదలైనవి), పాశ్చాత్య ప్రపంచంలో (స్విట్జర్లాండ్) ఉన్నాయి. బహుళజాతి ప్రజగా, సోవియట్ ప్రజ సోషలిజానికి గల కొత్త సుస్థిర లక్షణాలను ప్రదర్శిస్తోంది. సోవియట్ ప్రజలను నూతన సమాజం అని అభివర్ణించడానికి కారణం ప్రధానంగా దాని కొత్త సామాజిక అంశమే. సోవియట్ ప్రజకూ బహుళ జాతులు గల ఇతర సోషలిస్టు సమాజాలకూ (ఉదాహరణకు, యుగొస్లావ్ ప్రజలకు లేక, వియత్నాం ప్రజలకు) ఉమ్మడి సోషలిజానికి గల స్థిర లక్షణాలు ఉన్నాయి.

సోవియట్ నరవర్గ బృందాల మధ్య రాజీలేని వైరుధ్యాలు లేనేలేవు. తీవ్ర ఆర్థిక తప్పిదాలూ, స్తబ్దత, సామాజిక విధానాన్ని గురించిన తక్కువ అంచనా, సామాజిక న్యాయ, ప్రజాస్వామ్య అంతర్జాతీయతల ఉల్లంఘనలూ – యివే జాతుల మధ్య సంబంధాల వక్రీకరణలకు ప్రధానంగా కారణం. సోవియట్ సమాజ ఆమూలాగ్ర పున రుద్ధరణ కోసం సోవియట్ కమ్యూనిస్టు పార్టీ రూపొందించిన పంథా జాతుల మధ్య సామరస్యానికి అత్యంత ముఖ్యమైనది. పార్టీ 19 వ అఖిల యూనియన్ సమావేశ నిర్ణయాలు ఈ పునరుద్ధరణ లక్ష్యాలన్నిటినీ సాధించడానికి తోడ్పడతాయి.



సోవియట్ యూని యన్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ కరస్పాం డింగ్ సభ్యుడు, భాషాశాస్త్ర యిన్‌స్టి ట్యూట్ డైరెక్టర్ అయిన వి.సోన్‌త్సెవ్ యీ సమస్యకు సంబంధించి సమాధానా లిస్తున్నారు.

---

ప్రశ్న: సోవియట్ యూనియన్‌లో పెద్దా చిన్నా జాతులు దాదాపు 130 వున్నాయి. అంటే వివిధభాషలు మాట్లాడే వారు పరస్పరం అభిప్రాయాలు తెలియజేసుకునే సమస్య యిక్కడ కూడా యెదురౌతుంది. కాదంటారా?

జవాబు: భాషల సమస్య అనేది నిస్సందేహంగా జాతుల సమస్యలో ఒక భాగం. వాస్తవానికి ఒక దేశ భాష అనేది దాని నరవర్గ బాంధవ్యంలో అత్యంత ముఖ్యమైన లక్షణాల్లో ఒకటి. అందువల్ల, జాతీయ స్వీయ చైతన్యంలో అది యెంతో ముఖ్యమైనదని చెప్పొచ్చు.

భాషా సమస్యలు పరిష్కారంగాకుండా జాతుల సమస్యా పరిష్కారం కావడం పూర్తిగా అసాధ్యం. అంతర్ నరవర్గ సంబంధాల్లో వుద్రిక్తత తరచుగా భాషా ఘర్షణల రూపం తీసుకుంటూండడం యాదృచ్ఛికం కాదు. కజకస్తాన్‌లో జరిగిన విషాదకర ఘటనలూ, అజర్ బైజాన్

రిపబ్లిక్‌లో భాగంగా వుంటున్నప్పటికీ, ఆర్మీ నియన్ల జనాభా అధికంగా వున్నట్టి నగోర్నియ్ కరబాహ్‌లో జరిగిన ఘటనా యిందుకు వుదాహరణలు. ఒక బహుళజాతి రాజ్యంలో భాషా సమస్యలపట్ల ప్రత్యేకమైన శ్రద్ధ, జాగరూకతతో కూడిన వైఖరి - తీవ్రధోరణులను, అరకొరగా తీసుకునే నిర్ణయాలను తొలగించే వైఖరి-విధిగా అవసరం.

ప్ర: కానీ, ప్రస్తుత ప్రపంచంలో సమాచార వెల్లువ యెంతో త్వరగా పెరుగుతోంది. ప్రజల మధ్య సంబంధాల్లో ముమ్మరత యెంతగా పెరుగుతోందంటే, సమాచారానికి సంబంధించి ప్రధానమైన భారాన్ని మోయాల్సిన, నరవర్గ అనుసంధాన భాషలుగా మారాల్సిన పరిస్థితి కొన్ని భాషలకు తప్పనిసరి అవుతోంది.

.జ: ప్రస్తుత ప్రపంచంలో దాదాపు 3,500 భాషలు వున్నాయి. కానీ, వివిధ ప్రజలు అనేక విభిన్న భాషల్లో మాట్లాడుతూ వుండడంవల్ల భాషావరోధాన్ని అధిగమించాల్సిన సమస్య కొన్ని సందర్భాల్లో అనాదిగా తలెత్తుతున్నదే. ప్రజలు అప్పట్లో అనువాద కళను నేర్చుకోవడంతో బాటు పరస్పరం అర్థంచేసుకోవడంలో తమకు తోడ్పడగల యేదో ఒక వుమ్మడి భాషకోసం అన్వేషణ ప్రారంభించారు. మధ్యయుగపు యూరప్‌లో అంతర్ రాజ్య అనుసంధాన భాషగా లాటిన్ వుండేది. అధునికకాలం దాకా విజ్ఞానశాస్త్రానికి, దౌత్య సంబంధాలకు లాటిన్ భాషే అంతర్జాతీయ భాషగా వుంటూవచ్చిందని మనకు తెలుసు. మనకాలంలో అంతర్జాతీయ సంబంధాల కోసం అనేక భాషలను వాడుతున్నాం. యుద్ధానంతర కాలంలో రష్యన్ అంతర్జాతీయ భాషగా కూడా మారింది. ఐ.రా.స లో రష్యన్‌ను అధికారిక భాషగా గుర్తించారు.

ప్ర: విశ్వజనీన అంతర్జాతీయ భాషగా ఒక "కృత్రిమ" భాషను సృష్టించే ప్రయత్నాలను గురించి మీ అభిప్రాయం చెప్తారా?

జ: ఇలాంటి ప్రయత్నాలు అనేకం జరిగాయి. అయితే ఎస్పరాంటోగానీ, కృత్రిమమైన యే యితర భాషలు గానీ వ్యాప్తి చెందలేక పోయాయి. కానీ, ఎస్పరాంటోపట్ల ఆసక్తి తరగడం లేదు. అనువాదంతో అవసరం లేకుండా అభిప్రాయ వ్యక్తీకరణకు సార్వత్రిక మార్గాన్ని కనుక్కోవడం చాలా ఆకర్షణీయమైన లక్ష్యమే అయినా, యీ సమస్యపై యెంతో అధ్యయనం జరపాల్సిన అవసరం యిప్పటికీ వుంది.

బహుళజాతి దేశాల్లో జాతులమధ్య భాషావరోధాన్ని తొలగించాల్సిన అవసరం సాధారణంగా ద్విభాషా సూత్రానికి దారి తీస్తుంది. యీ క్రమం అనేక దేశాల్లో మనకు కనిపిస్తుంది. వాటిల్లో, సంఖ్యరీత్యా అతిపెద్ద జాతి మాట్లాడే భాషే సాధారణంగా వుమ్మడి భాష అవుతుంది. వుదాహరణకు చైనా ప్రజా రిపబ్లిక్‌లో చైనీస్, వియత్నాంలో వియత్నామీస్, బ్రిటన్‌లో యింగ్లీషు, సోవియట్ యూనియన్‌లో రష్యన్ భాషలు, వగైరా. ఒక విదేశీ భాష కూడా దేశంలో వుమ్మడిభాషగా మారవచ్చు- వుదాహరణకు మాజీ వలసదేశాల్లో యింగ్లీషు, యితర పాశ్చాత్య భాషలు. స్విట్జర్లాండ్ లాంటి ద్విభాషా దేశాల్లో భాషావరోధాన్ని తొలగించడానికి ద్విభాషా సూత్రం మాత్రమే సాధనంగా వుపయోగపడగలదు. యెందుకంటే, రెండు ప్రభుత్వ భాషల్లో యేదో ఒకటి యెంచుకోవాల్సి వస్తే, అది మరోభాష మాట్లాడే ప్రజల్లో తప్పక అసంతృప్తిని సృష్టిస్తుంది.

కానీ బహుళ జాతి దేశాల్లో ఒక వుమ్మడి భాష తప్పనిసరిగా అవసరమని నేను మళ్ళీ చెప్తున్నాను. కొంతమంది మాత్రమే అనేక భాషలు మాట్లాడుతూ వుండొచ్చు. కాగా ద్వితీయ భాష నేర్చుకోడానికి గొప్ప కృషి అవసరం లేదు. దాన్ని మాతృభాషతో బాటు యెవరైనా నేర్చుకోవచ్చు. కానీ మనం చరిత్రపుటలు తిరగేస్తే, యీ అవశ్యకతను కొన్ని సందర్భాల్లో మాత్రమే గుర్తించడం జరిగింది. యీ ఆవశ్యకతను గుర్తించకపోవడమనేది వ్యతిరేకతకు కూడా— ముఖ్యంగా వుమ్మడి భాషను ప్రజలమీద బలవంతంగా రుద్దినప్పుడు— దారితీసింది.

ప్ర: అక్టోబర్ విప్లవానంతరం రష్యన్ భాషకు ప్రభుత్వ భాషగా ప్రతిపత్తి లేకుండా

పోవడానికి కారణమేమిటి? సోవియట్ పాలన ప్రారంభమైనప్పుడు మొదట్లో జాతీయ భాషల పరిస్థితి యెలా వుండేది?

జ: విప్లవానికి పూర్వం అధికారిక, ప్రభుత్వ భాషగా వుంటూ వచ్చిన రష్యన్ భాష విప్లవానంతరం అప్పటికే అంతర్ నరవర్గ అనుసంధాన భాషగా మారసాగింది. కానీ అది అప్పటికింకా రష్యనేతర ప్రజానీకంలో విస్తృతంగా వ్యాప్తికాలేదు. ప్రజల్లో ద్విభాషా సూత్రం నిజంగా లోతుగా వేళ్ళూనుకోలేదు.

దేశంలోని ప్రజలందరికీ సోవియట్ ప్రభుత్వం సమానహోదాను ప్రకటించింది. అంటే భాషల సమానత అనికూడా దాని అర్థం. బహుళజాతుల సోవియట్ రాజ్యానికి సంబంధించి "ఒక ప్రభుత్వ భాష" అనే భావననే వి.ఐ.లెనిన్ మొత్తం మీద తీవ్రంగా వ్యతిరేకించాడు. ప్రభుత్వ భాషను సమర్థించడం సిగ్గుచేటనీ, యెందుకంటే - అది పోలీసు వత్తిడిని వుపయోగించడం లాంటిదేననీ ఆయన రాశాడు. అంతర్ నరవర్గ అనుసంధాన భాషగా రష్యన్ భాషకిచ్చిన నిర్వచనం శాస్త్రరంగంలో, వాడుకలో రుజువయింది. అదే సమయంలో, వర్ణమాల లేని అనేక భాషలకు (దాదాపు 50) యిప్పుడు వర్ణమాలలు యేర్పడ్డాయి. యీ భాషల్లో వార్తాపత్రికలు, మ్యాగజైన్లు వెలువడసాగాయి. నూతన సాహిత్య సంప్రదాయాలు రూపుదిద్దుకోసాగాయి. 1920 లలో, 1930 లలో భాషాభివృద్ధిదశ సోవియట్ రాజ్యంలోని భాషాశాస్త్ర రంగంలో చాలా ముఖ్యమైనది. సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలు మరింత అభివృద్ధికావడమనేది ద్విభాషా సూత్ర (జాతీయభాషతో బాటు రష్యన్ భాష) అభివృద్ధికి శక్తివంతమైన ప్రేరణనిచ్చింది.

ప్ర: కానీ ఆ క్రమంలో వైరుధ్యాలు లేవనుకోవడం పొరబాటే అవుతుంది. ద్విభాషా సూత్రం వల్ల యెలాంటి కొత్త సమస్యలు తలెత్తాయి?



వి. సోన్ త్సెవ్

జ: పిల్లలకు తమ మాతృభాషలో బోధించాలనే హక్కు సోవియట్ యూనియన్ రాజ్యాంగచట్టం అన్ని జాతులకూ యిచ్చింది; దీనికి అనుబంధ హక్కును చేర్చింది. యూనియన్ రిపబ్లిక్కుల్లో పిల్లలకు విద్యాబోధన జాతీయ భాషలో మొత్తం మీద మామూలుగా సాగినప్పుడు, సాపేక్షంగా చిన్న భాషా బృందాలు నివసిస్తున్న చోట్ల, తల్లిదండ్రులు తమ పిల్లలను రష్యన్ భాషా పాఠశాలలకు పంపించేందుకు తరచుగా ప్రయత్నించేవారు; యిప్పటికీ ప్రయత్నిస్తున్నారు. యెందుకంటే, రష్యన్ భాషలో మంచి పరిజ్ఞానం లేని వ్యక్తి తన సొంతవూరికి మాత్రమే పరిమితమైపోతాడు. వున్నత విద్యా సంస్థల్లో, తదితరాల్లో ప్రవేశించడం కష్టమౌతుంది. రష్యనేతర బాలలు రష్యన్ పాఠశాలల్లో రష్యన్ భాష నేర్చుకోవడం స్వచ్ఛందంగా నిర్ణయించుకునే విషయం. నిర్బంధమేమీలేదు.కానీ యీ సందర్భంగా, రష్యన్ నేర్చుకోవాల్సివచ్చే వస్తుగత

ఆవశ్యకతకూ, తమసొంత భాష నేర్చుకోవాలనే అభిలాషకూ మధ్య వైరుధ్యం తలెత్తుతుంది. యీ వైరుధ్యాన్ని యెంతమాత్రం అలక్ష్యం చేయరాదు. దీన్ని తొలగించే పద్ధతులకోసం అన్వేషణ జరపాలి.

ప్ర: ద్విభాషా సూత్రం సామాజిక అస్థిరతకు దారితీస్తోందనే, పిల్లల మనోవికాసాన్ని దెబ్బతీస్తుందనే అభిప్రాయాన్ని గురించి మీరేమనుకుంటున్నారు? యిటీవలికాలంలో యీ అభిప్రాయం పదేపదే వినవస్తోంది.

జ: నాకు తెలుసు. ద్విభాషా సూత్రాన్ని అతిచిన్న వయసులోనే ప్రవేశపెట్టడం వల్ల కలిగేహాని గురించిన తీర్పులు కొన్ని రిపబ్లిక్కుల్లో (వుదాహరణకు, ఎస్తోనియన్ రాదుగ పత్రికలో) ప్రచురితమయ్యాయి వుభయభాషలనూ సమానస్థాయిలో బాగా నేర్చుకోవాలనే కోరికవల్ల రెండు భాషల్లో యేదీ సరిగా రాదనీ "స్థానికేతర" భాషకూడా తరచుగా "వికృతమౌతుంది" అనీ అది రాసింది. ద్విభాషా సూత్రాన్ని సవాలుచేస్తూ అంతర్ నరవర్గ సంబంధాల కోసం ఒక వుమ్మడిభాష అక్కరలేదని చెప్పింది. అంటే, ఒకే రాజ్యానికి చెందిన సోవియట్ పౌరులు విదేశస్థుల్లాగా పరస్పరం దుబాసీల' సాయంతో మాట్లాడుకోవాల్సి వస్తుంది. అలాంటి వైఖరితో నేను యేకీభవించలేను.

కానీ, ఆ రిపబ్లిక్‌లోని రష్యన్లు స్థానిక భాష నేర్చుకునేందుకు యిష్టపడ్డంలేదని కూడా అదేవ్యాసం పేర్కొంది. అక్కడే జన్మించిన రష్యన్లకు సహజంగానే ఎస్తోనియన్ తెలుసు. కానీ చాలా మంది యితరులకు తెలీదు. నిజానికి; తమ సొంతభాష మాట్లాడని ప్రజలమధ్య నివసించేవారికి ఆ ప్రజలభాష తెలిసితీరాలి. స్థానికభాషల అధ్యయనాలపట్ల యిలాంటి తిరస్కారభావంవల్ల అసంతృప్తి బాగా పెరుగుతోంది. మరోవిషయం కూడా నేను నొక్కి చెప్పదల్చుకున్నాను. అనేక స్వయంపాలిత రిపబ్లిక్కుల్లో, ప్రాంతాల్లో వుదాహరణకు బుర్యాతియాలో, కల్మీకియాలో, వుత్తరాది కాకసస్‌లోని అనేక స్వయంపాలిత రిపబ్లిక్కుల్లో — నివసిస్తున్నవారు ఫిన్నో - యూగ్రిక్ భాషలు మాట్లాడతారు. మెజారిటీ జనాభాగా రష్యన్లు వున్నచోట స్థానిక భాషా విధులు పరిమితమౌతున్నట్లు మనకు కనిపిస్తుంది. యీ సందర్భంగా రష్యన్‌ను బలవంతంగా రుద్దడమనే ప్రసక్తేలేదు. యీ క్రమం చాలావరకూ వస్తుగతమైనది. కానీ దీనివల్ల ప్రజలకు యిబ్బంది కరంగా వుంటోంది.

ప్ర: ఇంతకూ యేం చేయాలంటారు? ఘర్షణలను ముందుగా వూహించి తప్పించడం యెలా?

జ: ద్విభాషా సూత్రాన్ని మరింత విస్తరించి, ప్రగాఢంచేసే పంథాను ప్రస్తుతం మన దేశంలో అనుసరిస్తున్నారు. అంతర్ నరవర్గ అనుసంధానభాషగా రష్యన్ అధ్యయనాన్ని మరింత విస్తృతంచేస్తూ జాతీయ భాషల సర్వతోముఖ వికాశం యేకకాలంలో జరగాలి.

ఇందుకు మరో మార్గంలేదనీ, వుమ్మడి అనుసంధాన భాష లేకుండా రాజ్యం సర్వ సమగ్రమైనదిగా మనజాలదని ప్రపంచానుభవం గట్టిగా రుజువుచేస్తోంది. ప్రత్యేకించి అభివృద్ధి చెందిన ఆర్థిక వ్యవస్థ, సంస్కృతిగల దేశానికి యిది వర్తిస్తుంది.

నరవర్గ భావనపరంగా సోవియట్ యూనియన్ మినహాయింపుకాదు; యిదొక చారిత్రక అస్తిత్వం – తమసొంత జాతీయ ప్రత్యేకతలను పరిరక్షించుకున్నట్టి వివిధ జాతుల, ప్రజల సమాజం. కానీ, "సోవియట్ ప్రజలను" మనం చారిత్రక అస్తిత్వంగా గుర్తిస్తే యీ సమాజ సభ్యుల మధ్య అభిప్రాయాల మార్పిడి కోసం ఒక వుమ్మడి సాధనం వుండాలి.

"స్వేచ్ఛాయుత అభివృద్ధి, జాతులమధ్య అనుసంధాన భాషగా సోవియట్ ప్రజలు స్వచ్ఛందంగా ఆమోదించినట్టి రష్యన్ భాషనూ, ఆయాజాతుల మాతృభాషలనూ సోవియట్ పౌరులు సమానంగా వుపయోగించుకోవడం

మన బహుళజాతి రాజ్యంలో అత్యంత ముఖ్యమైన సూత్రం'' అని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 19 వ అఖిల యూనియన్ సమావేశంలో ''సోవియట్ జాతుల మధ్య సంబంధాలు'' అనే తీర్మానం పేర్కొంది.

రష్యన్ వ్యాప్తి స్వచ్ఛందంగా మాత్రమే కొనసాగగలదు. యెలాంటి నిర్బంధంగానీ, తొందరపాటు గానీ తప్పనిసరిగా ప్రతిఘటనకు గురౌతుంది. మన జాతుల బహుముఖ సంస్కృతులను అందుబాటులోకి తెచ్చుకోడానికి ఒక సాధనంగా రష్యన్ భాషను నేర్చుకోవడమనేది ఆవశ్యకతగా భావించాలి.

ప్ర: చిన్నజాతుల వారు మాట్లాడే భాషల భవితవ్యమేమిటి? నిజానికి ఆధునిక నాగరికత, సమాచార వెల్లువల వత్తిడిలో వారు తమ స్థానాలను కోల్పోవడం లేదా? చిన్నజాతుల వునికిని కొనసాగించడానికి, వారసులకు వాటిని అందజేయడానికి వీలుగా ఆ జాతుల వారి భాషల, జానపదరచనల ''జెనొఫండ్'' లాంటిది నెలకొల్పాలని అకడమీషియన్ లిహచ్యోవ్ సూచించారు.

జ: ద్విభాషా సూత్రాన్ని మేము సమర్థించడం యధాలాపంగాకాదు. జనాభాలోని చిన్న బృందాలకు చెందినవారు మాట్లాడే భాషలను అన్ని విధాలా పరిరక్షించడానికి మనం జాగ్రత్త తీసుకోవాలి. అయితే, ఒక భాషను యేదో విధంగా కృత్రిమంగా పరిరక్షించే ప్రశ్నతలెత్తదు. శాస్త్ర-సాంకేతిక విప్లవ పరిస్థితుల్లో ఒక విద్యావంతుడు ఒకే భాషకు పరిమితమై వుండడం పూర్తిగా అసాధ్యం. అది ప్రజలకే నష్టం కలిగిస్తుంది. ఒకే రాజ్యంలో జాతీయ భాషలే (వాటిని వుపయోగిస్తున్న ప్రాంతాల్లో) భాషా సంబంధమైన విధులన్నీ పూర్తిగా నిర్వహించాలనడం కూడా సబబుకాదు. అనేకానేక రంగాలకు వుమ్మడి భాష అవసరం.

తమజాతీయ భూభాగాలకు వెలుపల నివసిస్తూనే, తమ పిల్లలకు జాతీయ భాషలో చదువునేర్పించాలనుకునే వివిధ జాతుల ప్రజలను గురించి కూడా మేనం ఆలోచించాలని నా దృఢవిశ్వాసం. జాతీయ భూభాగాల వెలుపల జాతీయ పాఠశాలలను నెలకొల్పాలనే అభిప్రాయాలను పత్రికలు వ్యక్తం చేయడం యెంతో సముచితం. తమ రిపబ్లిక్కుకుగానీ, ప్రాంతానికిగాని బయట నివసిస్తున్న ప్రజలు తమ మాతృభాషలో మంచి పరిజ్ఞానం సంపాదించుకునే విషయమై వారి అవసరాలను మనం గౌరవించి, సంతృప్తిపర్చాలి.

ద్విభాషా సూత్రం ఒక వాస్తవికత అనే విషయం ప్రపంచ అనుభవమంతా రుజువు చేసింది. ద్వితీయ భాషలో కొంత పరిజ్ఞానం విశాల దృక్పధాన్ని కలిగిస్తుంది; మరోజాతి తాలూకు సాంస్కృతిక విలువలను అందుబాటులోకి తెస్తుంది.

# ప్రపంచ సమస్యలు: మానవ యుద్ధ దృక్పథం

ఏ ప్రముఖ శాస్త్రజ్ఞుడైనా సరే తన రంగంలో అగ్రేసర ప్రవీణుడుగా ఉండటం మాత్రమే సరిపోదు. అతనికొక విశాల దృక్పథం, మార్దవ హృదయం కూడా ఉండాలి. ప్రపంచంలో జరుగుతున్నవాటి విషయంలో తన సమకాలీనులకు, భవిష్యత్ తరాలకు తాను బాధ్యుడనన్న స్ఫూర్తి అతని కుండాలి. కానీ, వాస్తవ జీవితంలో ఇలా ఉందా? ఇందుకు సమాధానం కోసం అంతర్జాతీయ పగ్వాష్ ఉద్యమ సభ్యులను అడుగుదాం. దాని యిటీవలి 38వ సమావేశం 1988 లో సోచి వెలుపల దాగోమిస్‌లో జరిగింది. ఆ ఉద్యమ సభ్యులైన ముగ్గురు ప్రపంచ ప్రఖ్యాత భౌతిక శాస్త్రవేత్తలతో జరిపిన ఇంటర్వ్యూను సంగ్రహంగా దిగువయిస్తున్నాం. వారు: పగ్వాష్ ఉద్యమ ప్రధాన కార్యదర్శిగా కొత్తగా ఎన్నికైన ఫ్రాన్సిస్కో కలోగెరో (ఇటలీ), ప్రభుత్వ సలహాదారు రిచర్డ్ గార్విన్ (అమెరికా), సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ అంతరిక్ష పరిశోధనా సంస్థ డైరెక్టర్, అకడమీషియన్ రోవల్డ్ సగ్దేయెవ్.

ప్రశ్న: ప్రపంచ ప్రభుత్వాన్ని ఏర్పర్చవలసిందిగా పగ్వాష్ ఉద్యమాన్ని అడిగారని, మాటవరసకు, అనుకొందాం. అప్పుడు, అది అనుసరించే కార్యక్రమం ఏమిటి?

కలోగెరో: వాస్తవ జీవితంలో ఎప్పుడైనా అలా జరుగుతుందని అనుకోను. కాని, ఇటీవల ప్రపంచ సమస్యను గురించి ఆలోచిస్తున్నారు. జాతీయ, సైద్ధాంతిక, సరిహద్దులను అధిగమించిన సమస్యలను తీసుకొంటున్నారు. మానవతా దృక్పథాలను అవలంబిస్తున్నారు. వారి ఈ కార్యకలాపాలు రాజకీయ వేత్తలు సైతం గుర్తిస్తున్న దానికంటే విస్తృతమైనవి.

గార్వీన్: వగ్వాష్ ప్రభుత్వ స్థాపన భావాన్ని నేను సమర్థించను. అది ఆచరణ యోగ్యం కాదు. కానీ, అలా జరిగిందనుకొందాం. అప్పుడు, ప్రపంచ సమస్యలే మారిపోతాయి. రక్షణ బలాల అవసరమే ఉండదు. సైనికావసరాలకు ఖర్చవుతున్న డబ్బు అభివృద్ధి కార్యక్రమాలకు ఉపయోగించవచ్చు. అణుయుద్ధ ప్రమాదం తొలగి పోతుంది. దేశాల మధ్య విద్వేషాలకు మారు శాంతియుత సహకారమూ, పోటీ ఉంటాయి. అయితే ప్రపంచ దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని వదులు కొంటాయా అని నా అనుమానం.

సగ్దేయెవ్: శాస్త్రజ్ఞుల పాలన కేవలం ఒక ఊహే అయినా అది ఆకర్షణీయమైనది. ఎందువల్లనంటే, శాస్త్రజ్ఞులకు ఇతరులనేకులకన్నా ఎక్కువ సామాజిక బాధ్యతా భావం, మరింత విశాలమైన ప్రపంచ దృక్పథం ఉన్నాయి. పైగా శాస్త్రీయంగా ఆలోచించగలరు, పనిచేయగలరు. ఇది కాక తప్పుచేశామన్న ఆత్మక్షోభ వల్ల నిష్కృతి కోసం తాపత్రయ పడుతున్నారు. ముఖ్యమైన విషయమేమంటే, వగ్వాష్ ఉద్యమం సిద్ధాంతపరమైనది కాదు. అందువల్ల సైద్ధాంతిక దృక్పథాలతో సంబంధం లేకుండా ప్రపంచ సమస్యలను అది పరిష్కరించగలదు. శాస్త్రజ్ఞులు ప్రపంచంలో కెల్లా ఎక్కువ జగదేక భావం గలవారు— ఆమాటకు గల మంచి అర్థంలో.

గార్వీన్: ప్రస్తుతం సమాజం సమర్థంగా పనిచేసే తీరున అది వ్యవస్థీకృతమై ఉంది. కుటుంబం తర్వాత మానవులను కలిపికట్టేది ప్రపంచ స్థాయే.. అయితే, అటువంటి సమాజ వ్యవస్థీకరణ సమర్థవంతమైనదిగా ఉండదు. ప్రస్తుతం మనిషి అవసరాలను దేశ స్థాయి వ్యవస్థ తీరుస్తూ ఉంది.

**సాంస్కృతిక మమేకత ముఖ్యమైనదే. కాని, దానికి తోడు, వ్యక్తికి సమస్త మానవాళితో, సమాజంలో ఒక భాగంతో మమేకతా భావం ఉండాలి.**

అయితే, దేశభక్తి స్వభావం ఎలాంటిదంటే, ఇతర దేశాలతో యుద్ధం వస్తే మనిషి తనదేశాన్ని సమర్థించకుండా ఉండలేడు, అయితే, అటువంటి ఘర్షణలను రానీకుండా చేయటం మంచిది. అవి మానవాళి ప్రయోజనాలకు విరుద్ధమైనవి.

సగ్దేయెవ్: తనజాతి సంస్కృతితో మమేకత దేశభక్తికి మూలమని అనుకుంటున్నాను. ఇతర దేశాలతో తలపాటుకు వీలివ్వనిదేశభక్తి భావనలు ఉండటం ముఖ్యం.

గార్వీన్ : దేశభక్తి అజ్ఞానంతో మిళితమైనప్పుడు అది హద్దు మీరడం కద్దు.

కలోగెరో : యూరోప్ దేశభక్తి తరచు దిగజారి పోయింది. అటువంటి దేశభక్తిని జాతీయవాదం అనడం సరియైనది. అనేక యుద్ధాలకు దారి తీసింది అదే. దేశభక్తికి పౌర ధర్మనిరతి కూడా ఒక అంగంగా ఉండాలి. సాంస్కృతిక మమేకత ముఖ్యమైనదే. కాని, దానికితోడు, వ్యక్తికి సమస్త మానవాళితో, సమాజంలో ఒక భాగంతో మమేకతాభావం ఉండాలి. దోస్తొయెవ్ స్కీ, బీతోవెన్ వారిదేశీయులకే కాదు. సమస్త మానవాళికీ చెందినవారు. కాని మరోదేశ సంస్కృతిని అర్థం చేసుకోవడం కష్టమే. అయితే, ఇతర సంస్కృతుల సంపర్కంవల్ల ఏదేశ సంస్కృతి అయినా మరింత పరిపుష్టమవుతుంది.

గార్వీన్ : ఇతర సమాజాలలోని మంచిని చూడగలగాలి.

సగ్దేయెవ్ : మనం సరియైన సమయంలో వీటిని గురించి మాట్లాడుతున్నాం. ఎందు వల్లనంటే, దేశభక్తిలో ఒక మంచి అంశముందని అర్థం చేసుకోవడం నేడవసరం. కానీ, అది వెర్రితలలు

వేస్తే సహకారానికి వ్యతిరేకమై ఇతర దేశాలతో తలపాటుకు దారి తీస్తుంది.

**విలేకరి:** పగ్వాష్ సభ్యులకే అధికారముంటే వారు, వెంటనే రక్షణ వ్యయాన్ని అనవసరమైన దిగా చేస్తారని గార్విన్ అన్నారు. కాని, వాస్తవ జీవితంలో అనేక మంది శాస్త్రజ్ఞులు రక్షణ రంగంలో పనిచేస్తున్నారు. శాస్త్రజ్ఞులందరూ యుద్ధ పరిశ్రమను బహిష్కరించి, ఆ విధంగా, ఆయుధపోటీ అంతమయ్యేలా చేసే స్థితి సాధ్యమా?

**గార్విన్ :** శాస్త్రజ్ఞులు యుద్ధ పరిశ్రమను బహిష్కరించగలరని కానీ, బహిష్కరించాలని గానీ నేననుకోవడంలేదు. సోవియట్ యూనియన్‌లోను, అమెరికాలోను శాస్త్రజ్ఞులు వాటిలో పనిచేస్తున్నారు. ఆ విధంగా, తమ దేశభక్తి యుత విధిని నిర్వర్తిస్తున్నారు. తమ దేశప్రజల భద్రతకు ఇది అవసరమని వారి నమ్మకం. కాని యుద్ధం వచ్చేప్రమాదం లేదని ఆయుధాలపై డబ్బు ఖర్చు చేయడం వృథా అని ప్రజలు నిర్ణయిస్తే ఈ శాస్త్రజ్ఞులు వేరే పనులు చూచుకోవలసి వస్తుంది. మిహాయిల్ గోర్బచేవ్ కోర్కె అదే. ప్రపంచ మెదుర్కొంటున్న ఇతర సమస్యల పరిష్కారానికై శక్తి, యుక్తులనూ, వనరులను వినియోగించడం అన్ని దేశాలకూ ముఖ్యమే.

**కలోగెరో:** ఒక శాస్త్రజ్ఞుడు సైనిక శాఖలో పనిని స్వీకరించిన తరువాత, తన పరిశోధన ఫలితాలపై అతనికి అధికారముండదు. బహుశా, అతని మనస్తత్వమే మారిపోవచ్చు. ఒకానొక ఆయుధాన్ని రూపొందించాలన్న రాజకీయ నిర్ణయం జరిగితే ఉన్నతమైన నైతిక సూత్రాలకు కట్టుబడినవారు తమ ఉద్యోగాలకు రాజీనామా ఇచ్చినా ఆపని చేయడానికి సిద్ధపడే వారెందరో ఉంటారు. కాబట్టి, విశాల ప్రజానీకానికి విజ్ఞప్తి చేయడమే

**వేరే దేశాలకు ప్రమాదం లేకుండా ఒక దేశానికి రక్షణ కల్పించే పద్ధతుల కోసం ప్రపంచమంతటా అకాడమీలు యితర రక్షణ పరిశోధన కేంద్రాలు అధ్యయనం చేస్తున్నాయి.**

సరైన పద్ధతి. శాస్త్రజ్ఞులకు ప్రభుత్వాలకు సైనిక పరిశోధనలను మానుకొమ్మని చెప్పడం నిరుపయోగం.

**సగ్దేయెవ్:** ఆయుధపోటీని అంతమొందించేందుకు ఇది సరియైన మార్గం కాదని నేనంగీకరిస్తున్నాను. విజ్ఞానశాస్త్రం, శాస్త్రజ్ఞులు తమ కాలానికి బందీలు.

**విలేకరి :** పగ్వాష్ ఉద్యమం దాదాపు నిరుపయోగమైనదని, కేవలం సభలూ, పెద్ద పెద్ద ప్రకటనలకు పరిమితమైందని ఒక అభిప్రాయముంది. కాదంటారా?

**గార్విన్ :** పగ్వాష్ ఉపయోగకరమైనదని నాగట్టి విశ్వాసం. దీనికి రెండు ఉదాహరణలు. ఐదేళ్ల క్రితం, డెన్మార్క్‌కు చెందిన యాండర్స్ బోసెరప్ "ఆత్మరక్షణా రక్షణ" ను గురించి ఒక సమావేశంలో మాట్లాడారు. అది ఇతరదేశాలపై దాడి చేయజాలని ఒక సైనిక రక్షణవ్యవస్థ. అది అమాయకమైనదని నాకూ, ఇంకా అనేకులకూ అనిపించింది. కానీ, పగ్వాష్ ఈ భావాన్ని మనసుకు పట్టించుకొని అనేక చర్చావేదికలను నిర్వహించింది. మరోదేశానికి ప్రమాదం లేకుండా ఒకదేశాన్ని రక్షించడానికి వీలు కల్పించే సిద్ధాంతాలను ప్రపంచమంతటా అకాడమీలు, రక్షణ పరిశోధనా విశ్లేషణ కేంద్రాలు ఇప్పుడు రూపొందిస్తున్నాయి. మరో ఉదాహరణ. యూరప్‌లో అణ్వాయుధాలను గురించి శాస్త్రజ్ఞులు జెనీవాలో ఏర్పాటు చేసిన చర్చా గోష్ఠులు, ఐ.ఎన్.ఎఫ్. సంధికుదరడానికి తోడ్పడ్డాయి.

**కలోగెరో :** మరికొన్ని ఉదాహరణలివ్వగలను. పగ్వాష్ రసాయన ఆయుధాల విషయంలో ప్రభుత్వాల మధ్య ఒప్పందాలకు దారి ఏర్పరుస్తోంది.

**సగ్దేయెవ్ :** ఈ ఉద్యమాన్ని గురించి చాలా మందికి సరిగా

తెలియదు. అది నిజానికి ఒక ముఖ్యపాత్ర వహించింది. మిసిలీ రక్షణ వ్యవస్థను రూపొందించడం చాలా ప్రమాద కరమైనదనీ, అది యుద్ధానికి దారి తీయగలదనీ మొదట చెప్పినది పగ్వాష్ సభ్యులే వ్యూహాత్మక ఆత్మరక్షణను, వ్యూహా త్మకదాడి శక్తితో మేళవించే ప్రమాదముందని పగ్వాష్ శాస్త్రజ్ఞులు రుజువు చేశారు. (ఇక్కడున్న గార్విన్ వారిలో ఒకరు.) కాబట్టి, ఎ.బి.ఎం సంధి కుదరడానికి శాస్త్రజ్ఞులూ కొంత వరకు తోడ్ప డ్డారని చెప్పవచ్చు.

**కలోగెరో:** వ్యూహాత్మక రక్షణ వ్యవస్థలను రూపొందించాలనే భావం "బాగానే ఉందని" ఒకప్పుడు సోవియట్ యూనియన్ అభిప్రాయపడింది. సోచి సమావేశంలో . సోవియట్ శాస్త్రజ్ఞుడు లెవ్ ఆర్ట్సిమోవిచ్ తన ప్రభుత్వ దృక్పథానికి భిన్న మైన నిర్ధారణలుగల నివేదిక సమర్పించారు. తుదకు, అది, సోవియట్ ప్రభుత్వ వైఖరి మారడానికి దారి తీసింది.

**సగ్దేయెవ్ :** అలాంటి మరో ధైర్యవంతుడైన ప్రముఖ శాస్త్రజ్ఞుడు ఆంద్రీ సఖరోవ్ మన మధ్య ఉన్నందుకు మనకెంతో సంతో షంగా ఉంది.

**విలేకరి :** కానీ, ఇప్పుడు అమెరికా ప్రభుత్వం నక్షత్రయుద్ధ కార్యక్రమాన్ని (ఎస్.డి.ఐ) అమలు జరపాల్సిన అవసర ముందని పట్టుబడుతోంది. పగ్వాష్ సభ్యుల అభిప్రాయమేమి?

**గార్విన్:** ఎస్.డి.ఐ. మంచి దని పగ్వాష్ సభ్యుడు ఒక్కడు కూడా చెప్పలేదు. అసలు సంగ తేమిటంటే దాన్ని సులభంగా ధ్వంసంచేయవచ్చు, లేదా, దాట వేయవచ్చు. మేమీ విషయాన్ని మా పత్రికల్లో రుజువు చేశాము. అధ్యక్షుడు రీగన్ శాస్త్రీయాధారాలు లేకుండానే తన **ఎస్.డి.ఐ** ని ప్రకటించాడు.

**అణుయుద్ధం ప్రమాద వశాత్తు, సంభవించ కుండా చూచుకోవాలి తప్పులు, ప్రమాద కరమైన పొరపాటు హెచ్చరికలను గురించిన గణాంక సమాచారాన్ని, మనం పరస్పరం తెలియ జేసుకోవాలి.**

**కలోగెరో :** ఎస్.డి. ఐకి భవి ష్యత్తు లేదని అంతర్జాతీయ శాస్త్రజ్ఞులు, అధికుల అభి ప్రాయం. అయినా, దాన్ని సమర్థించే కొద్దిమంది శాస్త్రజ్ఞు లతో మేము చర్చలు జరపడం అవసరం. ఆ పనే ఇప్పుడు చేస్తున్నాం

**విలేకరి :** అణ్వాయుధ పోటీ కొనసాగితే అణుయుద్ధం సంభ వించగల ప్రమాదం గురించి మీ అంచనా ఏమిటి?

**గార్విన్:** వచ్చే 20 ఏళ్ళలో అటువంటి ప్రమాదం 50 శాతం ఉంటుంది. ఈపోటీని మనం వెనుక పట్టు పట్టించ గలిగితే, అణ్వాయుధాలు తగ్గు తూ పోతే ఆ ప్రమాదం నూరే ళ్ళలో 1. శాతానికి తగ్గిపోవచ్చు. మానవాళికి ముంచుకొస్తున్న ఇతర ప్రమాదాలతో పోల్చితే ఇది ప్రమాదమే కాదు.

**కలోగెరో :** అణ్వస్త్ర యుద్ధ ప్రమాదం ఇప్పటికీ పెద్దదే వాటి విస్తరణ వల్ల ఇదింకా పెర గవచ్చు. అయితే, నేడు మెరు గైన అంతర్జాతీయ వాతావర ణంలో మనము ఆశాభావంతో ఉండాలి. అణ్వస్త్ర రహిత ప్రపంచం ఒక వాస్తవం కాగలదు.

**సగ్దేయెవ్ :** ప్రమాదవశాత్తూ అణుయుద్ధం సంభవించే ప్రమాదం నేడుంది. సంక్షోభాల సమయంలో అది పెరుగు తుంది. ఉద్రిక్తతలు సడలితే అది తగ్గుతుంది.

ఒకమాట, భద్రత కంప్యూ టర్లపై ఆధారపడి ఉన్నప్పుడు వాటి అమ్మకాలను నిషేధించ డంలో అర్థమేమైనా ఉందా? ప్రమాదవశాత్తు అణుయుద్ధం సంభవించే సమస్యను మనం చేప ట్టి పరిష్కరించాలి తప్పులు, ప్రమాదకరమైన పొరపాటు హెచ్చ రికలను గురించిన గణాంక సమాచారాన్ని బహుశా, మనం పరస్పరం తెలియజేసుకోవాలి. ఎందు వల్లనంటే మనం పరస్పరా ధీన ప్రపంచంలో నివసిస్తున్నాము.

చరిత్రపుటలు

# గ్రిగోరీ జినవ్యేవ్

దీమ్త్రి షెలెస్తొవ్,
పిహెచ్.డి. (చరిత్ర)

రష్యన్ సోషల్-డెమొక్రటిక్ లేబర్ పార్టీ (ఆర్ ఎస్ డి ఎల్ పి) ఆరవ సమావేశం (ప్రాగ్, 1912) తనకేంద్ర కమిటీ సభ్యుల్లో ఇద్దరిని మాత్రమే ఏకగ్రీవంగా ఎన్నుకొంది. వారు లెనిన్, జినవ్యేవ్‌లు. (ఆనాడు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ పేరది) పార్టీ పై నిషేధం తొలగింపబడిన వెంటనే 1917 ఏప్రిల్‌లో జరిగిన పార్టీ ఏడవ సమావేశంలో కేంద్ర కమిటీ ఎన్నికల ఫలితాలను ప్రకటించి నప్పుడు మొదట పేర్కొన్న బడింది కూడ లెనిన్, జినవ్యేవ్‌లే. తరువాత 3 నెలలకు పార్టీ ఆరవ మహాసభ జరిగింది. కేంద్రకమిటీకి ఎన్నికైన కమ్యూనిస్టుల పేర్లు రహస్యంగా ఉంచడంకో లం,అందరికన్న ఎక్కువ ఓట్లు వచ్చిన నలు గడురి పేర్లు తప్ప మిగతావి ప్రకటించలేదు. ఆ నలుగురు లెనిన్ (134 ఓట్లలో 133) జినవ్యేవ్ (132 ఓట్లు), కామనెవ్, ట్రాట్స్కీ (చెరి 131 ఓట్లు).

తరువాతి పార్టీ మహాసభల యధాతధ నివేదికలను పరిశీలిద్దాం. తీవ్రమైన జబ్బువ ల్ల లెనిన్ పార్టీ 12 వ మహాసభకు హాజరు కాలేదు. ఆయనకు బదులు జినవ్యేవ్ మహాస భకు కేంద్రకమిటీ రాజకీయ నివేదికను సమర్పించారు. లెనిన్ గతించిన అనతికా లంలోనే, 1924 లో పార్టీ 13 వ మహాసభ జరిగింది. అప్పుడు కూడ జినవ్యేవ్ ప్రధాన నివేదికను సమర్పించారు.

జినవ్యేవ్ అసలుపేరు గ్రిగోరీ రధోమిస్లాస్కీ. ఆయన రహస్యంగా పని చేయవలసివచ్చిన పుటి పేరది. 1883 లో యెలిజవెత్ గ్రాడ్ నగరం (నేటి కిరోవోగ్రాడ్) లోని ఒక చిన్న పాడి కేంద్రం యజమాని కుటుంబంలో జన్మించారు. గ్రిగోరీ 14 వ ఏటనే ప్రైవేట్లు చెప్పి డబ్బు గడించేవారు. ఇంట్లోనే చదువు కుని, నాడు ప్రఖ్యాతమైన బెర్న్ (స్విట్జర్ లాండ్) విశ్వవిద్యాలయం ప్రవేశ పరీక్ష 1904 లో ప్యాసయారు. కాని త్వరలోనే చదు వుకు స్వస్తి చెప్పి, విప్లవకార్యకలాపాల్లో నిమగ్నుడయారు: 1901 లో, 18 ఏళ్ల గ్రిగోరీ ఆర్.ఎస్.డి.ఎల్.పి లో చేరారు. 1903 లో నాడు జెనీవాశివారులో నివసిస్తున్న లెనిన్‌ను మొదటిసారిగా కలుసుకొన్నారు.

రెండు, మూడేళ్ళ తరువాత రష్యాలో రహస్యకార్యకలాపాల్లో ఈ యువ విప్లవ కారు డు తన సత్తాచూపించారు. పార్టీ 5 వ మహాసభలో (లండన్, 1907) 24 ఏళ్ల జినవ్యేవ్ పార్టీ కేంద్ర కమిటీకి ఎన్నికయ్యారు. 1908 మధ్యలో ఆయన జెనీవాకు వచ్చి, లెనిన్‌తో పాటుగా, లెనిన్ మార్గదర్శకత్వం కింద దాదాపు 10 సంవత్సరాలు పనిచేశారు.

1917 లో లెనిన్‌తో పాటు విప్లవ రష్యాకు తిరిగివచ్చారు. 1917 వేసవిలో విప్లవ ప్రతీఘాతకుల దాడినుంచి రక్షణకై రష్లివ్‌లో రహస్యంగా వున్న రోజుల్లో ఆయనతోపాటు జినవ్యేవ్ కూడ వున్నారు. లెనిన్ లాగే జినవ్యేవ్ సైతం, 1917 అక్టోబరు సాయుధ విప్లవం ప్రారంభమయ్యే వరకు రహస్యంగా ఉండవలసి వచ్చింది.

1917 డిసెంబరులో జినవ్యేవ్ పెత్రోగ్రాడ్ సోవియట్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. తరువాత 18 నెలలకు మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సంస్థాపక మహాసభ జరిగింది. జినవ్యేవ్ దాని కార్యనిర్వాహక కమిటీ అధ్యక్షుడయారు.అక్టోబరు విప్లవం తరువాత, 14 వ మహాసభ (1925) వరకు—ఆ సభలోకూడ — ఆయన పార్టీ కేంద్ర కమిటీకి ఎన్నికవుతూ వచ్చారు. 1919 నుంచి 1921 వరకు పొలిట్‌బ్యూరో ప్రత్యామ్నాయ సభ్యుడుగా, 1921 నుంచి 1926 వరకు దాని పూర్తి సభ్యుడుగా వున్నారు.

ఆయన జీవితం మలుపుతిరిగిన 1926 వరకు ఇదీ జినవ్యేవ్ జీవిత చరిత్ర. ఆ మలుపు అనుకోకుండా వచ్చిందా? ఇది అపామాషీగా వేసిన ప్రశ్నకాదు; సులువైన ప్రశ్నకాదు. గ్రిగోరీ జినవ్యేవ్ తో సహా ప్రముఖ పార్టీ, ప్రభుత్వ నాయకుల పునరావాసం వల్ల గత చరిత్ర తేటతెల్ల మవుతుందనుకోవడం తప్పు. ఇక్కడ సమస్య ఎవరినో పాతాళానికి అణగదొక్కడం, లేదా ఆకాశానికెత్తడం కాదు; నేటి, రేపటి కర్తవ్యాల దృష్ట్యాగతాన్ని సరిగా అంచనా కట్టడం. లెనిన్ పరిశీలనా పద్ధతి ననుసరించి, మనం ఆకాలాన్ని, ఆనాటి వ్యక్తులను, వారి ఆకాంక్షలను, ఆవేశాలను, వ్యక్తిగత స్పర్థలవల్ల క్లిష్టమై పోయిన నాటి సైద్ధాంతిక పోరాటాన్ని అర్థం చేసుకోవలసివుంది. దానికి లోతైన పరిశోధన అవసరం.

జినవ్యేవ్ లెనినిస్టు బోల్షివిక్ విప్లవ దళానికి చెందిన వారని గుర్తించడమంటే, ఆయన రాజకీయ తప్పులను, పొరపాటు అంచనాలను దాచి పెట్టడమని అర్థంకాదు. వాటిని యిప్పుడు సమగ్రంగా, సైద్ధాంతిక ఆధారాతో విశ్లేషించడం అవసరం.

అక్టోబరు విప్లవానికి నిర్ణయాత్మకమైన కొద్ది వారాలుగా జినవ్యేవ్, కామెనెవ్‌లు సాయుధ తిరుగుబాటు వైపు లెనిన్ మొగ్గుదల తమకు అంగీకారం కాదని పార్టీ కేంద్ర కమిటీకి చెప్పారన్న వాస్తవాన్ని సోవియట్ యూనియన్ చరిత్ర పాఠ్యపుస్తకాలు దశాబ్దాలుగా నొక్కి నొక్కి చెబుతున్నాయి. ఆ మాటనిజమే. కాని వారిని లెనిన్ సమ్మె విచ్ఛేదకులుగా పేర్కొని, వారిని పార్టీ నుంచి బహిష్కరించాలని డిమాండ్ చేయడానికి కారణమదికాదు. వారిద్దరూ కేంద్ర కమిటీ తీర్మానంపై బహిరంగ పత్రికల్లో ప్రకటనచేసి, ఆ విధంగా కేంద్ర కమిటీకి వెలిగా ఉండిపోయినందుకు లెనిన్ ఆగ్రహావేశులయారు. పార్టీ సభ్యులకు అది అర్హమైన పనికాదు. తరువాత అయిదేండ్లకు లెనిన్ జినవ్యేవ్, కామెనెవ్‌లను గురించి యిచ్చిన రాజకీయ అంచనాను స్పష్టంగా అర్థం చేసుకొనేందుకు ఆ అక్టోబరు ఉదంతం గురించిన ఈ అవగాహన తోడ్పడుతుంది.

ఆ కాలమంతటా జినవ్యేవ్, కామెనెవ్‌లు లెనిన్‌కు అత్యంత సన్నిహిత సహయోధులుగా ఉన్నారు. సరిదిద్దుకొన్న తప్పులను ప్రత్యేకమైన అవసరంలేనిదే జ్ఞాపకం చేయడం తప్పని లెనిన్ ఒక సందర్భంలో చెప్పారు. ఆయన తీవ్రంగా జబ్బు పడి, పార్టీ మహాసభకు తన లేఖను చెప్పి రాయించడం ప్రారంభించిన 1922 చివర అటువంటి "ప్రత్యేకావసరం" యేర్పడింది. ఆ లేఖ సంగతి ఇప్పుడందరికీ తెలుసు. లెనిన్ తన జీవితంలో దాదాపు చివరిసారి జినవ్యేవ్‌ను పేర్కొంటూ, జినవ్యేవ్, కామెనెవ్‌లకు సంబంధించిన ఆ "అక్టోబరు ఉదంతం" ఏవిధంగానూ యాదృచ్ఛికమైందికాదని దృఢంగా చెప్పారు. అక్టోబరు విప్లవానికి కాస్త ముందు జినవ్యేవ్ కామెనెవ్‌లు రాజకీయ నాయకులుగా చూపిన అహంకారమూ, నిగ్రహం కొరవడటం — ఇదీ, లెనిన్ మనసులోవున్నదని కనిపిస్తూనే వుంది. పెత్తనం కోసం తాపత్రయంగా పెంపొందగల దుర్గుణాలివి. "వ్యక్తి



(ఎడమనుంచి) స్టాలిన్, రైకోవ్, జినవ్యేవ్, బుఖారిన్—1924

పూజ'' గురించిన మన ప్రస్తుత అవగాహన ప్రకారం, జినవ్యేవ్, గానీ, కామెనెవ్ గానీ తన ''వ్యక్తిపూజ'' ను స్థాపించడానికి 1920 దశాబ్ది ప్రథమార్ధంలో ప్రయత్నించారని భావించడానికి ఎట్టి ఆధారాలూ లేవు. లెనిన్ సహచరుల్లో ఎవరూ, గతించిన ఆనాయకుని స్థానం అలంకరించజాలరని జినవ్యేవ్‌కు స్పష్టంగా తెలుసు. సూత్రరీత్యా సమిష్టి నాయకత్వం వుండాలని ఆయన అభిమతం. కాని దానిలో తనకు ఒక ప్రత్యేక స్థానం ఉండాలన్న కోర్కె మాత్రం ఎక్కువయింది. ట్రాట్స్కీకి కూడ దాదాపు ఇదే వర్తిస్తుంది. కాని 1923 లో ఆయన సమర్థకులు పరాజితులై, అప్పటికి ఆయన ప్రతిష్ఠ ఘోరంగా దెబ్బతినింది. బోల్షెవిజంను తిరుగ తోడటానికి ప్రయత్నించి ఒందుకూ, పెట్టీ బూర్జువా పెడదోరణిలో పడి నందుకు వారిని పార్టీ 13 వ మహాసభ (1924 జనవరి) అభిశంసించింది.

ట్రాట్స్కీవాదులకు వ్యతిరేకంగా సాగిన ఆసైద్ధాంతిక పోరాటానికి జినవ్యేవ్ కామెనెవ్‌లు నాయకత్వం వహించగా ఇందులో స్టాలిన్ కూడా పాల్గొన్నారు. ఆనాడు స్టాలిన్ పేరు దేశానికి అంతగా తెలీదు. అంతకు ఒక సంవత్సరానికి ముందు (1922 ఏప్రిల్‌లో) కామెనెవ్ సూచనపై స్టాలిన్ కొత్తగా ఏర్పాటయిన పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి పదవి చేపట్టారు. లెనిన్ గతించే నాటికి, జినొవ్యేవ్, కామెనెవ్, ట్రాట్స్కీలు పొలిట్‌బ్యూరోలోని ప్రధాన నాయకత్రయంగా ఉండేవారు.

13 వ మహాసభకు 5 రోజుల ముందు, 1924 మేలో నదెజ్దా క్రుప్స్కయా మహాసభకు లెనిన్ లేఖను కేంద్రకమిటీ కమిషన్‌కు అంద

# గ్రిగోరి జినవ్యేవ్

జేశారు. ఆ లేఖను, పార్టీ నుంచి దాచడంలో, ఆ ముఖ్య పత్రంలోని సూచనలు, అమలు జరగకుండా చేయడంలో పలుసందర్భాలలో జినవ్యేవ్, కామెనెవ్, స్టాలిన్‌లు నిర్ణయాత్మక పాత్ర నిర్వహించారని ఇటీవల గమనించడం జరిగింది. ట్రాట్స్కీ, స్టాలిన్‌ల మధ్య ఆనాడున్న సంబంధాలు పార్టీ నాయకత్వ సుస్థిరతకు అత్యంత ప్రమాదకరమన్న లెనిన్ మాటలను జినవ్యేవ్, కామెనెవ్‌లు ట్రాట్స్కీతో తమకుగల పోటీ కారణంగా పట్టించుకోలేదు. స్టాలిన్‌ను ప్రధాన కార్యదర్శి పదవిలో ఉంచడానికి వీరు తమకు చేత నయినదంతా చేశారు. ''మన రాజకీయ వ్యవస్థ''లో మార్పులు తీసుక వచ్చి తీరాలని లెనిన్ తన లేఖలో చెప్పినా, వారు నాటి పరిస్థితిని చెక్కు చెదరనివ్వలేదు. అది తమకు అనుకూలమని వారి నమ్మిక. ''అక్టోబరు ఉదంతం'' యాదృచ్ఛికమైనది కాదన్న లెనిన్ మాటనరియైనదే. ఎందువల్లంటే, అలాంటిదే 1924 లో కూడ జరిగింది. 1917 లో జినవ్యేవ్, కామెనెవ్‌లు పార్టీ సభ్యేతర విశాల ప్రజానీకానికి నేరుగా విజ్ఞప్తి చేశారు. 1924 లో పార్టీ నాయకుని అతిముఖ్య ఆదేశాలను పార్టీ నుంచి దాచారు.

ఒక తప్పుటడుగు తరువాత తప్పులకు దారితీయక తప్పదు. 1920 దశాబ్ది తొలిసంవత్సరాల్లో నగరాలకు ట్రాట్ స్కీ, జినవ్యేవ్, స్టాలిన్ పేర్లు పెట్టడం మొదలయింది (ట్రాట్స్కీ, జినవ్యేవ్‌స్కీ, స్టాలిన్ గ్రాడ్ వగైరా). ఈ పై పెత్తనం కోసం ప్రయత్నాలకు ఇది వ్యక్తీకరణ. ఇదే తుదకు నిరంకుశాధికారానికి బాటవేసింది. సమిష్టినాయకత్వానికి సంబంధించిన లెనినిస్టు సూత్రాలను ఉల్లంఘించి, ''నాయక పాత్ర ధారి'' గా వ్యవహరించి నందుకు జినవ్యేవ్ వంటి విప్లవకారుని జీవితం విషాదకరంగా ముగిసింది.

జినవ్యేవ్, ఈ బలహీనతకారణంగా లెనిన్ ''వీలునామా''ను నిర్ణాయక సమయంలో - 1925 లో జరిగిన పార్టీ 14 వ మహాసభలో బయటపెట్టలేదు. అప్పటికే పైకొంటున్న స్టాలిన్ పాలనను ఆయన కామెనెవ్ మొదలైన ప్రతినిధులతో కలిసి ప్రతిఘటించడానికి ప్రయత్నించారు. కాని ఆసరికే కాలం మించిపోయింది. సోషలిజం నిర్మాణం గురించిన వక్ర భావాలు ఆ ప్రయత్నాలను వమ్ముచేశాయి. కాని, స్టాలిన్ ఆ ప్రయత్నాలనుమరిచిపోలేదు.

1923-1924 లో జినవ్యేవ్ బోల్షెవిజానికి కట్టుబడి ట్రాట్స్కీకి వ్యతిరేకంగా పోరాడారు. 14 వ మహాసభలో తన ప్రయత్నాలు విఫలమయిన తరువాత ఆయన ట్రాట్స్కీతో జతకట్టారు. 1927 లో పార్టీ 15 వ మహాసభ జినవ్యేవ్ ను, ప్రతిపక్షంలోని ఇతర ప్రముఖులను పార్టీనుంచి బహిష్కరించింది.

మరునటి సంవత్సరం జినవ్యేవ్ తనకార్యకలాపాలు తప్పని అంగీకరించగా, ఆయన్ను తిరిగి పార్టీలో చేర్చుకొన్నారు. కాని ఆయన శక్తియుతమైన రాజకీయకార్య కలాపాలు అప్పటికే ముగిసినట్లే. ఏవ్యక్తి స్థానాలను బలపరచడానికి తాను సహాయపడి, ఆ విధంగా స్టాలిన్ వ్యక్తిపూజ పెంపొందేందుకు అవసరమైన పరిస్థితులు ఏర్పడటానికి వస్తుగతంగా తోడ్పడ్డాడో. అవ్యక్తి క్రూర అధికార బలంపై జినవ్యేవ్ జీవితం అంతకంతకు ఆధారపడుతూవచ్చింది.

జినవ్యేవ్ జీవించివున్న ఆఖరు సంవత్సరాల్లో ఆయన అఖిల యూనియన్ వినియోగదారుల సంఘం బోర్డు సభ్యుడుగా వున్నారు. 1934 డిసెంబరు, ఆదివారం తెల్లవారుజామున ఆయన్ను తీసుకవెళ్ళి జైల్లో కుక్కారు. 1936 ఆగస్టు 14 న ఆయనకు విధించిన శిక్షను ఒక సైనిక న్యాయవాది చదివి వినిపించారు. మరణ దండనతో ఆయన జీవితం ముగిసింది.

గ్రిగోరీ :జినవ్యేవ్ పేరు వీరోచిత, నాటకీయ ఘటనా భరితమైన మన చరిత్రలో భాగమే.

### సోవియట్-భారత సంబంధాలు : నిన్న, నేడు రేపు

# మైత్రీ మూలాలు

ఎం.కపిత్స
సోవియట్ యూనియన్
విజ్ఞానశాస్త్రాల
అకాడమీ కరస్పాండింగ్
సభ్యుడు అకాడమీ తాలూకు
ప్రాచ్య
విషయాధ్యయన సంస్థ
డైరెక్టరు

సోవియట్-భారత బహువిధ సహకారం రెండు దేశాల ప్రజల జీవితాల్లో ఒక ముఖ్యాంశమయింది. ఇది ఆ దేశాల ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక, సామాజిక, జాతీయ, సాంస్కృతిక సంబంధాల అభివృద్ధినే కాకుండా, మొత్తం అంతర్జాతీయ సంబంధాలను సైతం ప్రభావితం చేస్తూంది. అంతర్జాతీయ సంబంధాల్లో నూతన ఆలోచనా ధోరణి నెలకొన్నట్లయితే, భిన్న సామాజిక వ్యవస్థలుగల దేశాల మధ్య సహకారానికి ఎంతగొప్ప అవకాశాలున్నాయో సోవియట్ యూనియన్, భారతదేశం యావత్ ప్రపంచానికీ నిరూపించి చూపుతోంది.

రెండు దేశాలమధ్య అన్ని రంగాల్లోనూ మైత్రీ బంధాలు బలపడినకొద్దీ, సహజంగానే, ఈ స్నేహానికి చారిత్రక మూలాలూ, అవశ్యంగా వుండవలసిన పరిస్థితుల గురించి ఆసక్తి పెరుగుతోంది.

### చారిత్రకమూలాలు

మన రెండు దేశాల మధ్య సంబంధాలకు కొన్ని సహస్రాబ్దాల చరిత్ర వుంది. నేటి ఉత్తర, వాయువ్య భారత దేశం, పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, మధ్య ఆసియా, దక్షిణ రష్యా భూభాగాల్లో చరిత్రపూర్వకాలంలో నివసించిన తెగల మధ్య నరవర్గీయ, సాంస్కృతిక సంబంధాలు అనాదిగా వుండేవి. ఉదాహరణకు క్రీ.పూ 3-2 సహస్రాబ్దుల్లోనే పామిర్ ప్రాంతప్రజలకు, వాయువ్య భారతదేశం ఖరప్ సంస్కృతీ కేంద్రాలకూ మధ్య వర్తక సంబందాలుండేవని పురావస్తు శాస్త్ర తవ్వకాల్లో తేలింది. బౌద్ధమత వ్యాప్తివల్ల, కుషాన్ కాలంలో (క్రీ.పూ 1 వ శతాబ్దం, క్రీ.శ. 4 వ శతాబ్దం మధ్యకాలం) ఈ సంబంధాలు ప్రత్యేకించి బలపడ్డాయి. ఇప్పటి. దక్షిణ ఉజ్బెకిస్తాన్, దక్షిణతజకిస్తాన్ దక్షిణ తుర్క్మేని



# మిహయీల్ కపిత్స

యాల్లో బౌద్ధా రామాల, దేవాలయాల శిధిలాలూ, హూప్లి, బ్రాహ్మీలిపుల్లోని వ్రాతప్రతులు, శిల్పాలు, కుడ్యచిత్రాలూ బయటపడటమే ఇందుకు రుజువు.

భారతీయ మధ్య యుగాల నాటి మహమ్మదీయ శకం ప్రారంభమయిన తరువాత భారతదేశానికీ మధ్య ఆసియాకూ మధ్య సంబంధాలు మరింత బలపడ్డాయి. ఆరోజుల్లో నిపుణులయిన హస్త కళాకారులూ, యితర వృత్తులవారు మధ్య ఆసియా నుంచి భారతదేశానికి తరలి పోయారు. వీరూ, ఇరానీ సంతతివారు భారత దేశంలో సమాజాన్ని సైనిక పద్ధతిలోనూ, ఫ్యూడల్ పద్ధతిలోనూ వ్యవస్థీకరించడానికి పూనుకొన్నారు. ఇంతే కాదు, వారు ప్రవేశపెట్టిన కొత్త పాదార్థిక, ఆత్మక సంస్కృతిమూలంగా, భారతీయ తత్వశాస్త్రం, కవిత్వం, శిల్పం, అనువర్తితకళలు, మొదలయినవి కొత్త లక్షణాలతో పరిపుష్టమయాయి. వలస వచ్చిన వీరికి మధ్య ఆసియాతో జన్మతః ఉన్న అనుబంధాలు భారతదేశానికీ, మధ్యఆసియాకు మధ్య వర్తక, సాంస్కృతిక సంబంధాల అభివృద్ధికి దోహదం చేశాయి. ఫలితంగా ఇటునుంచి భారతీయ సంస్కృతి ప్రభావం మధ్య ఆసియా పై పడింది. 11వ శతాబ్దిలో ప్రారంభమయిన ఈ పరస్పర సంబంధాలు 18 వ శతాబ్ది వరకు, 19వ శతాబ్దం వరకు కూడ కొనసాగాయి. ఈ దశలో భారతదేశం నుంచి మధ్య ఆసియాకు తెచ్చిన వేలాది భారతీయ వ్రాతప్రతులు, సూక్ష్మ వర్ణచిత్రాలు నేటు తాష్కెంట్, దుషాన్బే, మొదలయిన నగరాల శాస్త్రీయ కేంద్రాల్లో భద్రపరచబడ్డాయి. అమీర్ ఖుస్రో వంటి అనేక భారతీయ కవులకు తజికిస్తాన్, ఉజ్బెకిస్తాన్‌లు రెండవ మాతృదేశమయ్యాయి.

అసలు రష్యా, మాస్కోరాజ్యాలతో భారతదేశ సంబంధాలు స్థాపితమైంది అప్పుడే, రష్యన్ వర్తకుడు అఫనాసీ నికితిన్ భారతయాత్ర అనంతరం భారత దేశం గురించిన ప్రామాణిక సమాచారం మాస్కోకు మొట్టమొదటి సారిగా అందింది. ఆయన 15 వ శతాబ్దంలో రెండున్నర సంవత్సరాలు భారతదేశంలో ఉన్నారు. "మూడు సముద్రాల ఆవలికినౌకా ప్రయాణం" అన్న ఆయన రచన భారత ప్రజాజీవితంలోని వివిధ అంశాలను యదార్థంగా వర్ణించింది. 17 వ శతాబ్దంలో నాలుగు వర్తక, దౌత్య ప్రతినిధివర్గాలు భారతదేశానికి పంపబడ్డాయి. వాటిలో రెండు మొఘల్ రాజ్యానికి చేరుకొన్నాయి కూడ. 1630 లలో భారతీయ వర్తకుల పేట ఒకటి అస్త్రఖాన్‌లో 19 వ శతాబ్దప్రారంభం వరకువుండేది. రెండవ భారతీయ శిబిరం బాకూలో 18వ శతాబ్ది చరమార్థంలో స్థాపితమైంది. భారతదేశంలో ఆర్మేనియా వర్తకుల పేటలు రెండు దేశాల పరస్పర సంబంధాల పెంపుదలలో ఒకముఖ్య పాత్ర వహించాయి.

రష్యా భారతదేశానికి ఛాలా దూరంగా వుండటం వల్లనేమి, ఆనాడు మధ్య ఆసియాప్రాంతాలలోని సైనిక, రాజకీయ పరిస్థితిక్లిష్టంగా వుండటంవల్లనేమి రష్యా, భారత దేశాల మధ్య సంబంధాలకు అవరోధాలేర్పడ్డాయి 18వ శతాబ్దం మధ్యలో బ్రిటన్ భారతదేశాన్ని తన వలసగా చేసుకోవడం ప్రారంభించడం, 19 వ శతాబ్దం మధ్యలో ఇంగ్లండుకు, రష్యాకు మధ్యపోటీ ఆసియాలోనూ, మధ్యప్రాచ్యంలోనూ తీవ్రం కావడం ఈ అవరోధాలకుతోడయాయి. ఐనా రష్యన్ సమాజంలోని విస్తార బృందాలకు భారతందేశంపై గల ఆసక్తి తగ్గలేదు. ప్రగతిశీల రష్యన్ మేధావులు, ఈస్టిండియా కంపెనీకి వ్యతిరేకంగా భారత ప్రజలు సాగించే పోరాటంపట్ల ఎంతో

# మైత్రీ మూలాలు

సానుభూతి చూపారు. 19 వ శతాబ్దంలో, భారతదేశంపై రష్యాలో వెలువడిన అనేక గ్రంథాలు భారతదేశంలోని వలన పాలనను విమర్శించాయి. నోవికోవ్, రదిష్చెవ్ వంటి రష్యన్ విజ్ఞానవాదులూ, విప్లవ ప్రజా తంత్రవాదులైన బెలన్‌స్కీ, దొబ్రొల్యూబొవ్‌లూ భారతదేశంలో వలసపాలనను, రష్యాలోని జారిస్టు ప్రభుత్వంతో పోల్చారు. ప్రత్యేకించి దొబ్రొల్యూబొవ్ భారత ప్రజల 1857-1859 సాయుధ తిరుగు బాటును బలపరచారు.

### రష్యన్ యాత్రికులు

18 వ శతాబ్దం ద్వితీయార్థం నుంచి 20 వ శతాబ్దం తొలి సంవత్సరాల వరకు గల కాలంలో భారతదేశాన్ని సందర్శించిన రష్యా, ట్రాన్స్‌కాకసస్, మధ్య ఆసియా యాత్రికులు భారతదేశం గురించిన సమాచారం రష్యన్ పాఠకలోకానికి అందజేయడంలో ఒక ముఖ్య పాత్ర వహించారు. వీరిలో నాటక రంగానికి చెందిన గెరసిమ్‌లెబెదెవ్ ను గురించి ప్రత్యేకించి పేర్కొనాలి. ఈయన భారతదేశంలో 12 ఏళ్లు ఉన్నారు. ఈయన కలకత్తాలో పాశ్చాత్య తరహా బెంగాలీ నాటక రంగాన్ని 1795 లో స్థాపించారు. బెంగాలీ, హిందూస్తానీ భాషల్లో ప్రావీణ్యం సంపాదించడమేకాక, హిందూస్తానీ, భాషలో (కలకత్తా మాండలికం) మొట్టమొదటి వ్యాకరణాన్ని రచించారు కూడ.

రష్యన్ పర్యాటకుడు, ఉదారవాద భావాలుగల కళాకారుడు అయిన ప్రిన్స్ సల్తీకవ్ 1840 లలో భారత దేశాన్ని సందర్శించారు. ఆయన నాటి పంజాబ్ పాలకుడు, బ్రిటిష్ వ్యతిరేక పోరాటానికి నడుముకట్టిన యోధుడు అయిన రంజిత్ సింగ్ ప్రధాన కార్యాలయాన్ని సందర్శించారు, సిక్కుల సైనికజీవితాన్ని చిత్రించే చక్కని రేఖాచిత్రాలను గీచారు.

భారతీయ చరిత్ర, సంస్కృతుల క్రమానుసార అధ్యయనం రష్యన్ విశ్వవిద్యాలయాల్లోనూ, రష్యన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ లోనూ 1820 లు, 1830 ల లో ప్రారంభమయింది. సంస్కృత భాషాశాస్త్రాది విద్యలను నేర్పే ఒక రష్యన్ పాఠశాలను స్థాపించారు. ప్రాచీన భారతీయ సాహిత్య గ్రంథాలను రష్యన్ భాషలోకి అనువదించడం ప్రారంభమయింది.

1860 లు, 1870ల లో సంస్కృత నిఘంటువులు ప్రచురితమయాయి. భారతీయ ఇతివృత్తాలు రష్యన్ కవితారచనల్లో ప్రముఖ స్థానం అలంకరిస్తున్నాయి. దీనికి ఆద్యులు వి.ఎ.జుకోవ్‌స్కీ, ఎ.ఎస్. పుష్కిన్‌లు.

1874-1875, 1880, 1885-1886 సంవత్సరాల్లో భారతదేశం నేపాల్, బర్మా, సింహళ దేశాల్లో పర్యటించిన పీటర్స్‌బర్గ్ విశ్వ విద్యాలయ ఆచార్యుడు ఐ.పి.మినయెవ్ రష్యన్ ఇండాల జీలో (భారతీయ విషయాధ్యయన శాస్త్రం) ఒక నూతన దశకు నాంది పలికారు. ఆయన ప్రథమ భారతీయ విప్లకారుల్లో ఒకరైన ఫడ్కే సహచరులను కలుసుకొన్న సంగతి పేర్కొన దగినది. ఆయనా, ఆయన శిష్యులు ఎస్.ఎఫ్ ఓల్డెన్ బర్గ్ మొదలయినవారు రాసిన గ్రంథాలు ప్రపంచ ప్రఖ్యాతి చెందిన రష్యన్ బౌద్ధవిషయాధ్యయన శాఖకు ప్రాతిపదిక అయాయి.

ఇండాలజీపై రష్యన్ ప్రామాణిక గ్రంథాలపై ఆసక్తి ఇప్పటికీ తరగలేదు. వాటిలోకొన్ని పునర్ముద్రితమయాయి.

ఉభయ దేశాల్లోని ఆర్థిక, సామాజిక-రాజ కీయ పరిణామాలూ, రష్యాలో విప్లవ పోరాటాలు, భారత దేశంలో విమోచనోద్యమ అభివృద్ధీ ఈ దేశాల పరస్పర సంబంధాల పెరుగుదలకు అవసరమైన వస్తుగత పరిస్థితులను సృష్టించాయి. రెంటి మధ్య వర్తకం పెంపొందింది; సముద్రమార్గం ద్వారా సంబంధాలు స్థాపిత మయాయి. 19 వ శతాబ్ద చివరి 30 ఏళ్ళలో భారతదేశానికి వచ్చిపోయే రష్యన్ల సంఖ్యాబాగా పెరిగింది. శాస్త్రీయ రంగాల్లో కూడ సంబంధాలు నెలకొనడం ప్రారంభమయింది. భారతీయ పండితులను, రచయితలను, భారత జాతీయ కాంగ్రెస్ ప్రథమ అధ్యక్షుడైన బెనర్జీ, ప్రసిద్ధ చరిత్ర కారుడు బరీడార్కర్ వంటి వారిని కలుసుకొని వారితో పరిచయ మేర్పరచుకొన్న తొట్ట తొలి రష్యన్ ఐ.పి.మికోయవే. 19 వ శతాబ్ది ఆఖరు దశాబ్దాల్లోనూ, 20 శతాబ్దితొలి దశాబ్దాల్లోనూ రష్యన్ వృక్షశాస్త్ర, నరవర్గ శాస్త్ర, వ్యవసాయ, వాతావరణ శాస్త్ర ప్రవీణుల బృందాలు భారతదేశాన్ని సందర్శించాయి.

1860 లు 1880 ల లో బ్రిటన్, రష్యాలు ఆసియాలో పడుతున్న పోటాపోటీలను దృష్టిలో వుంచుకొని, వలస పాలన వ్యతిరేక శక్తులు జారిస్టు ప్రభుత్వంనుండి

తమకు కొంత మద్దతు లభిస్తుందని ఆశించారు. 19 వ శతాబ్దం ద్వితీయార్థంలో జారిస్టు ప్రభుత్వాన్ని తమవైపు తిప్పుకొనేందుకు రాజపుటాణ, కాశ్మీర్, ఇండోర్ సంస్థానధిపతులు కొందరు ప్రయత్నించడానికి ఇదీ కారణం. నామ్ ధారీ సిక్కుమతస్థుల తరపున తుర్కిస్తాన్కు 1879 లో వచ్చిన గురుచరణ్‌సింగ్, 1880 లలో రష్యాకు వచ్చిన మహారాజా రణజీత్‌సింగ్ కుమారుడు, దులీప్ సింగ్ జారిస్టు ప్రభుత్వం సహాయం చేస్తుందని ఆశించారు. కాని మధ్య ఆసియాలో వలస విధానం అవలంబిస్తున్న జారిస్టు ప్రభుత్వం వారి విజ్ఞప్తులను పెడ చెవిన పెట్టింది.

భారతీయ విప్లవకారులకు, ఈ ప్రగతిశీల రష్యన్ ప్రముఖులకు మధ్య 20 వ శతాబ్ద తొలి సంవత్సరాల్లో నెలకొన్న సంబంధాలు మరొకరకమైనవి. మదాంకామా, శ్యామజ్జీ, కృష్ణవర్మ ప్రవాసమున్న రష్యన్ విప్లవ కారులను పారిస్‌లో కలుసుకొన్నారు.

1905 రష్యన్ విప్లవం భారతీయ విమోచనోద్యమంపై మరింత ప్రగాఢ ప్రభావం నెరపింది. మహాత్మా గాంధీ ప్రథమ అఖిల రష్యారాజకీయ సమ్మె అనుభవాన్ని పరిగణనకు తీసుకొన్నారు. అహింసాత్మక సహాయ నిరా కరణోద్యమం అన్న ఆయన భావనరూపు గొనడంతో లియోతాల్‌స్తాయ్‌తో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలకు ఒక ముఖ్య పాత్రవుంది. తాల్‌స్తాయ్, గోర్కీలు ఆనాటి ప్రగతిశీల భారతీయులను ప్రభావితం చేశారు. తిలక్ రాజకీయ కార్యకలాపాలు నాటి రష్యన్ విప్లవ కారుల దృష్టిని ఆకర్షించాయి. తిలక్‌పై కేసు విచారణ, బొంబాయిలో సార్వత్రిక సమ్మె చారిత్రకంగా ఎంతో ముఖ్యమైనవని లెనిన్ చెప్పిన విషయం జగద్విదితమే.

### కొత్త దశ

మొదటి ప్రపంచయుద్ధకాలంలో రాజామహేంద్ర ప్రతాప్ నాయకత్వాన వున్న "భారతదేశ ప్రవాసప్రభుత్వం రష్యన్ ప్రభుత్వంతోనూ, ఫిబ్రవరి విప్లవం తరువాత, అప్పటి తాత్కాలిక ప్రభుత్వంతోనూ సంబంధాలు ఏర్పరచుకొనేందుకు ప్రయత్నించింది. కాని ఇది విఫలమైంది. అక్టోబరు విప్లవం తరువాత మాత్రమే ప్రతాప్‌కు, విప్లవ భారతదేశ ప్రతినిధిగా స్వాగతం లభించింది.

దానితో భారత-రష్యన్ సంబంధాల్లో ఒక కొత్త దశ ప్రారంభమయింది. రష్యన్ విప్లవానికి, భారత జాతీయ విమోచనోద్యమంలోని భిన్న ధోరణులవారు స్వాగతం పలికారు. భారతీయ విప్లవకారులు లెనిన్‌ను కలుసుకొన్నారు. "భారతీయ విప్లవకారుల సంఘానికి" లెనిన్ సందేశం, అమృతసర్‌లోని వలస పాలకులు సాగించిన సాముహిక హత్యా కాండను లెనిన్ ఆగ్రహంతో ఖండించడం. మొదలయిన వన్నీ చరిత్రకెక్కినవే.

బ్రిటిష్ ప్రభుత్వం ఎన్ని అడ్డంకులు కల్పించినా అక్టోబరు సోషలిస్టు విప్లవం గురించీ, అక్కడ సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం గురించీ వాస్తవ సమాచారం భారతీయ సమాజంలోని విస్తృత భాగాల్లో వ్యాపించింది. ఇందుకు ఎన్నో అంశాలు తోడ్పడ్డాయి. మొదటిది, కమ్యూనిస్టు ఉద్యమం 1920 ల్లో భారత దేశంలో స్థాపితం కావడం. కమ్యూనిస్టులు సంఘటిత కార్మిక, రైతాంగ ఉద్యమాల్లో నిర్ణయాత్మక శక్తి అయారు. అంతర్జాతీయట్రేడ్ యూనియన్, రైతాంగ సంస్థలతోనూ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌తోనూ, సోవియట్ ట్రేడ్ యూనియన్ల తోనూ వారి సంబంధాలు, మాస్కోలో ప్రవాసిత విప్లవ కారుల బృందస్థాపనా— ఇవన్నీ సమరశీల భారత దేశానికీ, సోవియట్ యూనియన్‌కు మధ్య సంబంధాలను మరింత పటిష్ఠం చేశాయి.

రెండవ విషయం, జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్ వంటి భారత జాతీయనాయకులు సోవియట్ యూనియన్ విజయాలను భారతప్రజలకు తెలియజెప్పడానికి ఎంతో కృషిచేశారు. 1927 లో నెహ్రూ సోవియట్ పర్యటనకు ఈ సందర్భంలోఎంతో ప్రాముఖ్యముంది.

సోవియట్లు భారత దేశజాతీయోద్యమానికీ, తరువాత స్వతంత్ర భారత్‌కు అత్యంత సన్నిహితమైన మిత్రమని నెహ్రూ పరిగణించారు. 1930 ల లో రవీంద్రనాథ్‌టాగూర్ సోవియట్ యూనియన్ సందర్శన "రష్యానుంచి లేఖలు" అన్న ఆయన రచన సోవియట్ యూనియన్ గురించిన వాస్తవాన్ని ప్రచారంచేయడంలో ఒక ముఖ్య పాత్రవహించాయి. గాంధీ శాస్త్రీయ సోషలిజాన్ని అంగీకరించకపోయినా, ఆయనకు "సోవియట్ ప్రయోగం" పట్ల ఎంతో సానుభూతి, లెనిన్‌పట్ల నిండు గౌరవం వుండేవి.

### పరస్పరాభిమానం పెరుగుదల

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో నెహ్రూచొరవపై సోవియట్ యూనియన్‌తో మైత్రీ సంఘం స్థాపితమైంది. ప్రముఖ రష్యన్ చిత్రకారుడు నికొలాయ్ రోరిక్, ఆయన కుమారులు యూరీ, స్వాతోస్లావ్‌లు భారత - సోవియట్ స్నేహ పటిష్ఠీకరణకు గణనీయమైన దోహదంచేశారు.

భారత ప్రజల విముక్తి ఉద్యమం విజయం పొందడంతో సోవియట్-భారత సంబంధాల్లో ఒక కొత్త దశ

# మైత్రీ మూలాలు

ప్రారంభమయింది. 1947 ఏప్రిల్‌లో, అంటే భారతదేశం ఇంకా స్వతంత్రంకాకముందే దానికీ, సోవియట్ యూనియన్‌కు మధ్య దౌత్య సంబంధాలు నెలకొన్నాయి. ఢిల్లీలో జరిగిన అంతర్ ఆసియా సమావేశంలో సోవియట్ ప్రతినిధి పాల్గొనడం కూడ చాలా ముఖ్యమైన ఘటన. నాటి నుంచి రెండు దేశాల మధ్య సంబంధాలు దినదినాభివృద్ధి చెందుతున్నాయి. 1955 లో సోవియట్, భారతదేశాల నాయకులు ఒకరు మరొక దేశాన్ని సందర్శించడం ఈ క్రమంలో ఒక ముఖ్యమైన ఘట్టం. యుద్ధ విధ్వంసిత సోవియట్ ఆర్థిక వ్యవస్థ పునరుద్ధరణ, నవభారత నిర్మాణం, నెహ్రూ ఆంతరంగిక, విదేశాంగ విధానం - ఇవి సోవియట్ - భారత బహుముఖ సహకారాభివృద్ధికి అవసరమైన వస్తుగత పరిస్థితులను సృష్టించాయి.

1953 లో మొదటి సోవియట్-భారత వర్తక ఒప్పందం మీద సంతకాలు జరిగిన నాటి నుండి ఈ వర్తక పరిమాణం కొన్ని డజన్లరెట్లు పెరుగుతూవచ్చింది. వర్తక సంబంధాలకు అండగా ఆర్థిక సహకారమూ వృద్ధి చెందుతోంది. భారతదేశంలో భారీ పరిశ్రమల స్థాపనకు సోవియట్ సహాయంచేసే విషయమై 1955 లో మొట్ట మొదటి ఒప్పందం కుదిరింది. ఆ తరువాత, 70 పారిశ్రామిక సంస్థలను - (ఇనుము, ఇంజనీరింగ్ మొదలయిన బహు విధరంగాల్లో) స్థాపించడంలో భారతదేశానికి సోవియట్‌యూనియన్ సహాయం చేసింది. ఇవన్నీ పనిచేస్తున్నాయి. ముఖ్యమైన మరో 40 పారిశ్రామిక ప్రాజెక్టులు నిర్మాణంలో వున్నాయి.

రెండు దేశాల్లో ఆర్థిక వ్యవస్థ పురోభివృద్ధి, ద్విపక్ష శాస్త్ర, సాంకేతిక సహకారానికి అనుకూల పరిస్థితులను సృష్టించింది. ప్రకృతి, సామాజిక శాస్త్రాలూ, అనువర్తిత శాస్త్ర, సాంకేతిక పరిశోధనా, దూరరోదసీ పరిశోధనా మొదలయిన ముఖ్య రంగాల్లో ఈ సహకారం జయప్రదంగా వృద్ధిచెందుతోంది.

ప్రతినిధి వర్గాల మార్పిడి, చలన చిత్ర, నాటక ఉత్సవాలు, వస్తుప్రదర్శనలు, కల్పనా శాస్త్ర గ్రంథాల అనువాదాల ప్రచురణ, ఇటీవల, 1987-1988 లో రెండు దేశాల్లో విస్తృతంగా నిర్వహించిన ఉత్సవాలు రెండు దేశాల ప్రజలను, మునుపెన్నడూ లేనంతగా సన్నిహితం చేశాయి. సి.పి.ఎస్.యు.కు. భారత జాతీయ కాంగ్రెస్‌కు మధ్య, రెండుదేశాల పౌర సంస్థల మధ్య ప్రత్యక్ష సంబంధాలు వాటి స్నేహాన్ని మరింత పటిష్ఠంచేశాయి. భారతదేశంలోని సోవియట్ యూనియన్‌తో స్నేహసంఘం, భారత-సోవియట్ సాంస్కృతిక సంఘం, సోవియట్ యూనియన్‌లోని సోవియట్-భారత స్నేహ సంఘం స్నేహ వాతావరణ సృష్టికి చేస్తున్న కృషి అంతాయింతాకాదు.

రెండు దేశాలమధ్య రాజకీయ సహకారం, కీలకమైన అంతర్జాతీయ సంబంధాల సమస్యలపై వాటి దృక్పథాల సారూప్యం, లేదా సామీప్యం బహుముఖ స్నేహ సంబంధాల సత్వరాభివృద్ధికి పునాది అయాయి. 1971 లో కుదిరిన శాంతి, స్నేహసహకార సంధి ప్రాతిపదికపై నెలకొన్న రాజకీయ సహకారాన్ని శిఖరాగ్ర సమావేశాలు, ఉభయదేశాల నాయకుల పరస్పర విశ్వాసం మరింత పటిష్ఠం చేశాయి.

శాంతి, సామాజిక ప్రగతికై నడుము కట్టి నిలబడ్డ చిరస్మరణీయురాలయిన ఇందిరాగాంధీ సోవియట్-భారత స్నేహానికి చేసిన అమూల్య కృషిని ఉభయదేశాల ప్రజలు పూర్తిగా గుర్తిస్తున్నారు. ఈ దేశాలమధ్య సంబంధాలు వాటి ప్రజలమధ్య గాఢ స్నేహంగా మారాయి. 1986 నవంబరులో మిహయిల్ గోర్బచెవ్ భారత సందర్శన, దీనికి బదులుగా 1987 జులైలో రాజీవ్‌గాంధీ సోవియట్‌యూనియన్ సందర్శనా యిందుకు మరో రుజువేకాక, పరస్పర సహకారాన్ని ఒకకొత్త స్థాయికి పెంచాయి. వారు సంతకం చేసిన ఢిల్లీ ప్రకటన, శాంతికోసం, నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ కోసం సాగుతున్న పోరాటంలో సోవియట్- భారత సహకారం నిర్వహిస్తున్న గొప్పపాత్రకు సంకేతమయింది. సోవియట్ యూనియన్‌లో పునర్వ్యవస్థీకరణ దశప్రారంభంకావడంతో సోవి యట్ - భారత సహకార స్నేహాభివృద్ధికి కొత్త పరిస్థితులు నెలకొంటున్నాయి

(అజియా ఇ ఆఫ్రికా సెగోద్న్యా నుంచి)

సోవియట్ - భారతసంబంధాలు : నిన్న, నేడు, రేపు

# సోవియట్ యూనియన్ : అపోహల్లేని నిష్పాక్షిక దృక్పథం

త్రిలోకి నాథ్ కౌల్

**1986 నుంచి సోవియట్ యూనియన్‌లో భారత రిపబ్లిక్ అసాధారణ సర్వాధికార రాయబారి.**



మాస్కోలో భారతరాయబార కార్యాలయాన్ని 1947 జూలైలో ప్రారంభించిన గౌరవం నాకు లభించింది. 1962. లో అక్కడ భారత రాయబారిగా ఉండే అవకాశం కలిగింది. 1986 లో మళ్ళీ ఆరాయబారి బాధ్యతలు నాకప్పగించారు. 1947 దరిమిలా సోవియట్ యూనియన్‌లో అనేక మార్పులు సంభవించాయి. మునుపు సోవియట్ యూనియన్‌లో ఉంటే తప్ప ఈమార్పుల ప్రత్యక్ష ప్రభావం మనకు అనుభూతం కావడం కష్టం. 1947 నుంచీ 1949 వరకూ దాదాపు రెండేండ్లు, 1962 నుంచీ 1966 వరకు దాదాపు నాలు గేళ్ళు, ఇప్పుడు ఇంచుమించు రెండేళ్ళు సోవియట్ యూనియన్‌లో గడిపే అదృష్టం నాకు కలిగింది. 1960 దశాబ్ది ద్వితీయార్థం, 1970 దశాబ్ది ప్రథమార్థం, భారత ప్రభుత్వ విదేశాంగ కార్యదర్శిగా, 1980 లు తొలి సంవత్సరాల్లో యునెస్కో కార్య నిర్వాహక సభ్యుడుగా పని చేశాను. గతనలభై ఏళ్ళుగా సోవియట్ వ్యవహారా ల్లోను, భారత-సోవియట్ సంబంధాల అభివృద్ధి లోను నా ప్రగాఢ ఆసక్తిని తెలిపేందుకే ఈ వియాలను పేర్కొంటున్నాను.

రెండవ ప్రపంచ యుద్ధం వెను వెంటనే సోవియట్ యూనియన్‌లో జీవితం సజావుగా లేదు. ఆ దేశం పడినన్ని బాధలు మరేదేశమూ పడలేదు. 20 మిలియన్ల మంది చనిపోయారు. ఉక్రెయిన్, బైలో రష్యా, మధ్య రష్యాలలో వ్యావసాయక, పారిశ్రామిక సంస్థలు ధ్వంస మయ్యాయి. లెనిన్‌గ్రాడ్ ముట్టడిలో ఉన్న

మూడేళ్ళు ఆ నగరప్రజల వీరోచిత పోరాటం మరపురానిది. కాబట్టి, యుద్ధం వెనువెంటనే వ్యక్తిగతంగా కలిగిన ఇబ్బందులను ఎవరూ లెక్కచేయలేదు. ఉదాహరణకు, మాస్కోలో సైతరి అనుకూలమైన నివాసవసతి దొరికేది కాదు. ఆనాడు మాస్కోలో టాక్సీలు దాదాపు లేనే లేవు. ఇప్పుడానగరంలో మిలియన్‌కు పైగా మోటారు వాహనాలున్నాయి. తాజా పళ్ళూ కూరగాయలు సులభంగా లభ్యమయ్యేవి కావు. దౌత్య వ్యవహర్తలు వాటిని స్టాక్ హెూంనుంచీ విమానంలోనో, హెల్సింకీ నుంచీ రైల్లోనో తెప్పించుకోవలసి వచ్చేది. సోవియట్ పౌరుల అష్టకష్టాలతోపోల్చి చూచి నప్పుడు, దౌత్యోద్యోగులకు కొద్దిపాటి ఇబ్బందులను గురించి ఫిర్యాదు చేసే హక్కుందామరి?

కాని, ఒక చిక్కు మాత్రం ఆనాడు బహు నిస్పృహ కలిగించింది. అదేమిటంటే మేధావు ను, బుద్ధి జీవులను, లేదా మామూలు పౌరులను కలుసుకొనే అవకాశం బొత్తిగా ఉండేదికాదు. స్టాలిన్ హయాంలో అధికారులు బయటి వారిని చాలా అనుమానంతో చూసేవారు. సోవియట్ పౌరులకు, విదేశీయులకు, ప్రత్యే కించి.. దౌత్యోద్యోగులకు మధ్య సంబంధాన్ని నిరుత్సాహపర్చేవారు. ఈ విషయమై, పార్టీ అధికారి ఒకరు నాతో ఇలా అన్నారు. "యుద్ధానికి ముందు మా స్నేహితులుగా వ్యవహరించిన అనేకుల్లో కొందరు శత్రువులని మేము కను గొన్నాము. వందమంది స్నేహితులైనా పోగొట్టు కొనేందుకు మేము సిద్ధమే కాని, వారిలో ఒక్కశత్రువైనా ఉండే ప్రమాదానికి మేము ఆస్కారమివ్వదలచుకోలేదు."

సోవియట్ యూనియన్‌లో నాటి జీవితం కష్టాలతో, ఒంటరి తవంతో గడపవలసి వచ్చిందన్న అభిప్రాయాన్ని కలుగజేయడం నా ఉద్దేశం కాదు. వారి భాష వచ్చి ఉంటే ఎవరైనాసరే పార్కుల్లో, మ్యూజియంలలో, కళాప్రదర్శనశాలల్లో, మామూలు ప్రజలను కలుసుకునే అవకాశం ఉండేది. ఐతే, వారిని ఇంటికి ఆహ్వానించే వీలులేదు. ప్రభుత్వం ఎంపిక చేసిన కొంతమంది మేధావులూ, రచయితలూ, కళాకారులతో సంబంధాలకు అనుమతి ఉండేది. మ్యూజియంల, కళా ప్రదర్శన శాలల సందర్శన, లేదా, సోవియట్ నాటకాలకు, సంగీత కచేరీలకు వెళ్ళడం మాకానాడు ఆహ్లాదకరమైన కాలక్షేపం. మరో ఇబ్బంది ఏమిటంటే, దౌత్యోద్యోగులు మాస్కో నుండి 40 కిలో మీటర్లకు మించి రోడ్డు ప్రయాణం చేయరాదన్న ఆంక్ష. ఈ ఆంక్ష ఇప్పటికీ ఉన్నా, సోవియట్ యూనియన్‌లో ఉన్న ఏ కొన్ని నిషిద్ధ ప్రాంతాలకో తప్ప అన్ని చోట్లకూ ప్రయా ణానుమతి ఉంది.

ఒక్క ముక్కలో చెప్పాలంటే 1940 ల తుది సంవత్సరాల్లో మాస్కోలో దౌత్యోద్యోగి జీవితం భౌతిక సౌకర్యాల దృష్టితో చూస్తే కష్టమైనదే. కాని, నాజీజంకు వ్యతిరేకంగా, అంతకు ముందు సామ్రాజ్యవాదుల జోక్యానికి వ్యతిరేకంగా, సోవియట్ ప్రజలు సాగించిన వీరోచిత పోరాటాన్ని అంతర్యుద్ధాన్ని దృష్టిలో వుంచుకొంటే, అక్కడి మా జీవితం అత్యంత ఆసక్తికరమైనది. స్టాలిన్ పాలనలో సోవియట్ యూనియన్ ఎన్నో కష్టాలకు, ఎగుడు దిగుడు లకు లోనైన్న మాట నిజమే. కానీ, ఇవేవి సోవియట్ ప్రజల సంకల్ప బలాన్ని భగ్నం చేయలేదు. వారి అపార కష్ట సహిష్ణుత, తమ గమ్యంపై వారికి గల విశ్వాసాన్నివారి చిత్త స్థైర్యాన్ని నిరూపించింది. అదీ, 1949 ఏప్రిల్‌లో నేను సోవియట్ యూనియన్ నుంచీ వెళ్ళిపోయినప్పుడు నా మనసుపై నిల్చిపోయిన చెరగని ముద్ర.నేను తరచు కలుసుకొనే అవకాశం కలిగిన మ దాం కొల్లొంతాయ్ సలహా మూలంగా ఆనాడు నేను విషయాలను సరియైన దృక్పథంతో అవగాహన చేసుకోగలిగాను.

1962 లో నేను తిరిగి సోవియట్ యూని యన్‌కు వచ్చినప్పుడు. అక్కడిదృశ్యం నాకు కనువిప్పు కలిగించింది. సి.పి.ఎస్.యు.20వ మహాసభ వ్యక్తి పూజను స్టాలిన్, ఆయన సహచరులు కొందరి తప్పులను బట్టబయలు

చేసిన ఫలితం కనిపించింది. దేశమంతటా ఒక కొత్త వాతావరణం నెలకొనింది. మరింత స్వేచ్ఛ, అంతర్గత చర్చలు, కొన్ని ప్రభుత్వ విధానాలపై విమర్శలు సైతం ఉండేవి. బ్యూరాక్రటిజంను నిరుత్సాహపర్చారు; "హకుందారీ పాలన" పెంపొందుతూ వచ్చినా, సోవియట్ మేధావులను, రచయితలను, సామాన్యులను కలుసుకోవడం మరింత సులభంగా ఉండేవి. అన్ని రిపబ్లిక్కుల్లో హోటళ్ళలో వసతీ, ప్రయాణాలకు అనుమతీ సులభంగా సంపాదించడానికి వీలుండేది.

సోవియట్ పౌరులను ఇంటికాహ్వానించవచ్చు. వారిళ్ళకు వెళ్ళి చూడవచ్చు. షాపుల్లో సరకులు మునుపటి కన్నా ఎక్కువ కనిపించాయి. శీతాకాలంలో కూడా తాజా పళ్ళూ కూరగాయలతో మార్కెట్లు నిండి ఉండేవి. అయితే, వాటి ధరలు మాత్రం అధికమే. 1940 లలో సోవియట్ యూనియన్‌లో ఉన్న దౌత్యోద్యోగికి ఈ పెద్దమార్పులు స్పష్టంగా కనిపించాయి. కానీ, మొదటిసారి అక్కడికి వచ్చిన వారు మాత్రం దీన్ని అర్థం చేసుకోలేక పోయారు.

## సోవియట్ యూనియన్: అపోహల్లేని నిష్పాక్షిక దృక్పథం

సోవియట్-భారత సంబంధాల విషయానికి వస్తే, 1955 లో ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ సోవియట్ సందర్శన తర్వాత ఈసంబంధాల్లో గొప్ప మార్పు వచ్చింది. సోవియట్ ప్రజలు అంత హృదయపూర్వకంగా, చిత్తశుద్ధితో, తమంతకుతాముగా, స్వాగతమిచ్చిన మొట్టమొదటి విదేశీ అతిథి ఆయనే, సహజంగా ఆయన పులకించిన గుండెతో, వెళ్ళిపోయేముందు "నా హృదయంలో ఒక ముక్కను మీతో వదలి వెడుతున్నాను," అని అన్నారు.

ఇవి వట్టి మాటలు కాలేదు. ఆర్థిక, శాస్త్రీయ, రాజకీయాది సమస్త రంగాలలో సోవియట్-భారతసంబంధాలు మూడు పువ్వులూ ఆరుకాయలుగా వర్ధిల్లడానికి అవి బీజా వాపనమని రుజువైంది. ప్రభుత్వరంగంలో ఇనుము, విద్యుచ్ఛక్తి, నూనె మొదలైన శాఖలకు చెందిన ప్రాజెక్టుల నిర్మాణానికి సోవియట్ సహకారం తోడ్పడింది. ఇటు, భారతదేశం సోవియట్ యూనియన్‌కు ఎంతో అవసరమైన వస్త్రాలూ, మొదలైన వినియోగ సరకులను సరఫరా చేసింది. రూపాయి- రూబుల్ చెల్లింపు ఒప్పందం ఈ పరస్పర వ్యాపారానికి ఎంతో తోడ్పడింది.

ఇక రాజకీయ రంగానికి వస్తే, సోవియట్ యూనియన్ భారతదేశానికి నమ్మకమైన మిత్రమని కాశ్మీర్, గోవా, భారత-పాకిస్తాన్ యుద్ధాలు మొదలైన పరీక్షా సమయాల్లో నిరూపణ అయింది. ఈ స్నేహ సహకారాలను స్థిర పరచిన శాంతి, స్నేహ, సహకారసంధి కాల పరీక్షకు తట్టు కొని నిలబడింది. అటు, సోవియట్ యూనియన్, భారతదేశ స్వతంత్ర అలీనతా విదేశాంగ విధానానికి ఎంతో విలువ ఇస్తోంది. ఇటు భారత దేశం,సోవియట్‌శాంతి విధానాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి అది ఇస్తున్న మద్దతును అమూల్యమైనవిగా భావిస్తోంది. రెండుదేశాల జాతీయ ప్రయోజనాల మధ్య ఎటువంటి ఘర్షణా లేదు.

1960లలో ఈ స్నేహం మరింత బలపడింది. 1966 జనవరిలో సోవియట్ యూనియన్ చొరవపై జరిగిన తాష్కెంట్ సమావేశం చరిత్రాత్మకమైనది. రెండు ఆసియా దేశాలు పాశ్చాత్య దేశాల, లేదా ఐ.రా.స సహాయం అర్థించకుండా మొట్టమొదటి సారిగా తమ వివాదాలను తామే పరిష్కరించబూనుకున్నాయి. తరువాత 1972 జూలై నాటి సిమ్లా సమావేశం కూడా అటువంటిదే. భారత-పాకిస్తాన్ ఘర్షణలో సోవియట్ యూనియన్ భారతదేశాన్ని బల పరుస్తూనే వచ్చింది. 1960 లలో భారత, సోవియట్ దేశాల మధ్య శాస్త్ర, సాంకేతిక నూతన రంగాలలో, ఉదాహరణకు, రోదసీ



జవహర్లాల్ నెహ్రూ, ఇందిరాగాంధీ 1955, మాస్కోలో

రంగంలో సహకారం ప్రారంభమై, తదనుగుణ మైన ఒప్పందాలు జరిగాయి. 1964 లో ఉభయదేశాల నాయకులు మారినా, వాటి మధ్య సంబంధాలు దృఢంగా కొనసాగడమే గాదు, మరింత పటిష్టమయ్యాయి.

దాదాపు 20 ఏళ్ళ తరువాత 1986 లో నేను సోవియట్ యూనియన్‌కు తిరిగి వచ్చి నప్పుడు, మన రెండు దేశాల మధ్య సంబంధాలు తాత్కాలిక ప్రయోజనాల ప్రాతిపదికపై ఏర్పడి నవి కావనీ, నిరాయుధీకరణ, ప్రపంచశాంతి మొదలైన మౌలిక విదేశాంగ విధానాల్లో ఏకీభావం వాటికి పునాది అనీ నాకు మరొక్కసారి ధ్రువ పడింది. సోవియట్ యూనియన్‌లో భారత రాయబారిగా వెళ్లమని 1980 లు తొలి రోజుల్లో శ్రీమతి ఇందిరా గాంధీ నన్ను కోరినప్పుడు నేనంగికరించలేదు. ఎందువల్లనంటే కొత్త నాయకత్వంకింద సోవియట్ విధానం ఏరూపు తీసుకుంటుందో నాకు నమ్మకంగా నాడు తెలియదు. కాని, పారిస్ సందర్శన సందర్భంగా టి.వీ లో మిహాయిల్ గొర్బచేవ్ మాటల తీరునూ, 1985 లో జెనీవాలో రీగన్‌తో ఆయన సమావేశాన్ని గమనించిన తర్వాత సోవియట్ నాయకత్వం నూతన రాజకీయ

ఆలోచనా సరళి పట్ల, ప్రపంచశాంతి, నిరాయుధీకరణలను సాధించాలనే దాని రాజకీయ సంకల్పం పట్ల నాకు నమ్మకమేర్పడింది. **కాబట్టి ప్రధాని రాజీవ్‌గాంధీ అదే ప్రతి పాదనే** చేసినప్పుడు, నేను రాయబారిగా వెళ్ళడానికి అంగీకరించాను. కానీ, నేను ఒక సంవత్సరం పాటు ఆపదవిలో ఉంటానని తరువాత ఉండ టమా, లేదా అనే సంగతిని నిర్ణయించు కొంటానని చెప్పాను. ఇక్కడికి వచ్చిన తర్వాత వ్లాదివోస్తోక్, ఖబరవోస్క్‌లలో గొర్బచేవ్ ప్రసంగాలు విన్నాను. ఆయన సాహసోపేతమైన చొరవలను ప్రశంసిస్తూ ఒక లేఖ పంపాను. మామూలుగా రాయబారులు అటువంటి ఉత్తరాలు రాయరు. కాని, నేను "విముక్తుడైన దౌత్య ప్రతినిధి" నని అను కొంటున్నాను. స్నేహానికి దౌత్యమర్యాదలు అడ్డు రాకూడదని నా అభి ప్రాయం. సోవియట్ నాయకుల భావం కూడా అదేనని నా అను భవంలో తెలిసింది. కొత్త సోవియట్ నాయకత్వం సోవియట్ సమాజంలోని చారిత్రక శక్తుల అభివ్యక్తిగా రంగం పైకి వచ్చింది. మాస్కోలో నాపదవీ నిర్వహణ సందర్భంలో నా అనుభవాల్లోకల్లా నా మనసుపై గాఢముద్ర వేసింది. గొర్బచేవ్ వ్యక్తిత్వం, ఆయన గుణగణాలు.

స్వీయప్రచారం కోసం నేను వి.ఐ.పీ లను వెళ్ళి చూడను. కాని, స్నేహసంబంధాల పటిష్టీకరణకో, లేక అంతర్జాతీయ సమస్యల పరిష్కారానికో అవసరమైతే వారిని కలుసు కోవాలని అభ్యర్థించడానికి నేను వెనుకాడను. సోవియట్ నాయకులకూ, నాకూ మధ్య అవగాహ నకు, అమెరికాలో ఒకప్పుడు సోవియట్, రాయబారిగా ఉండిన అనతోలిదోబ్రినిన్, భారత దేశంలో సోవియట్ యూనియన్ మాజీరాయబారి యూలీ వొరొన్‌త్సోవ్‌లు నాకెంతో తోడ్పడ్డారు. సోవియట్ మేధావులు, పాత్రికేయులు, కళాకారులు, శాస్త్రజ్ఞులు, ప్రొఫెసర్లు, విద్యార్థులు, మామూలు ప్రజలు నాపట్ల చూపిన ఆదరాభిమానాలు నాకెంతో ఉత్తేజమిచ్చాయి.

## సోవియట్ యూనియన్ : అపోహల్లేని నిష్పాక్షిక దృక్పథం

ప్రధానంగా, సోవియట్ యూనియన్‌లో భారతదేశ ఉత్సవం మూలంగా నేను వివిధ సోవియట్ రిపబ్లిక్కులలోని సామాన్య ప్రజలను కలుసుకోగలిగాను. వారంతా భారతదేశానికి నిజమైన స్నేహితులు. ఈ ఉత్సవాలు మన రెండు దేశాల సంస్కృతులను పరస్పరం అవగాహన చేసుకొనేందుకు వీలు కల్పించాయి. ఇవి కేవలం తాత్కాలిక ప్రదర్శనలు కావు. వీటి పర్యవసానంగా ఉభయదేశాల కళాకారుల మధ్య, విశ్వవిద్యాలయాల మధ్య, పత్రికల మధ్య ఆదానప్రదానాలు ఒక స్థిర సంప్రదాయాలు కాగలవు.

గత నాలుగు దశాబ్దాలుగా నెలకొని ఉన్న మన సంబంధాలను సమీక్షిస్తూ, రెండుదేశాల నాయకుల మధ్యా, ప్రజల మధ్యా ప్రగాఢ సయోధ్యా సహకారాలు నన్ను ముగ్ధుణ్ణి చేశాయని నేను చెప్పక తీరదు. రాజీవ్‌గాంధీ సోవియట్ యూనియన్‌కు మూడు దఫాలు వెళ్ళి రావడం, ప్రధాన కార్యదర్శి గొర్బచేవ్ 1986 నవంబర్ ఢిల్లీ సందర్శన, 1987 నవంబరులో సోవియట్ ప్రధాని రిష్కోవ్ భారతదేశ యాత్ర ఈ సంబంధాలను నిర్దిష్ట రంగాల్లో పటిష్ట పరిచాయి. రాజీవ్‌గాంధీ, మిహయీల్ గొర్బచేవ్‌లు సంతకాలు చేసిన ఢిల్లీ ప్రకటన చరిత్రాత్మక, విశ్వవ్యాప్త ప్రాధాన్యాన్ని గురించి వేరే చెప్ప నవసరంలేదు.

1987 జులైలో నెలకొల్పిన ఢిల్లీ రెస్టారెంట్ అందరి మన్ననలనందుకొంది. ఇది మొట్ట మొదటి భారత-సోవియట్ సంయుక్త సంస్థ.

ఇటువంటి వాటిని ఒదెస్సా మొదలగు సోవియట్ నగరాల్లో నెలకొల్పబోతున్నారు. భారతీయ ప్రవీణులు తాష్కెంట్, సమర్ఖండ్, బుఖారాల్లో హొటళ్ళను నిర్మిస్తున్నారు. క్రీ॥శ॥2000 సంవత్సరం నాటికి అటువంటి హొటళ్ళను 30 దాకా నిర్మించాలన్న ప్రతిపాదన ఉంది. అలాంటి సంయుక్త పథకాల్లూ, సహకారం మన ఆర్థిక సంబంధాల విస్తరణకు ఆవిష్కరించే అవకాశాలు అపారమైనవి. మా రక్షణ మంత్రి కె.సి.పంత్, ఆర్థిక, వాణిజ్య మంత్రి ఎన్.డి. తివారీ సోవియట్ యూనియన్ సందర్శన వల్ల ఉభయదేశాల విధానాలు పరస్పరం మరింత బాగా అర్థం చేసుకొనేందుకు అవకాశం కలిగింది.

సాంస్కృతిక రంగంలో మనసంబంధాలు అన్నిటికన్నా ఎక్కువ అభివృద్ధి చెందాయి. ఇందుకు ప్రతీక ఒకదేశ ప్రముఖుల విగ్రహాలు మరొకదేశంలో ప్రతిష్ఠింపబడటం. ప్రసిద్ధ సోవియట్ శిల్పి కొమోవ్ చెక్కిన ఇందిరా గాంధీ విగ్రహం 1987 జులైలో ప్రతిష్ఠింప బడింది. భారతీయ శిల్పి గౌతంపాల్ చెక్కిన మహాత్మాగాంధీ విగ్రహం 1988 జులైలో ఇందిరా గాంధీ విగ్రహం ఎదుటనే ఆవిష్కరించ నున్నారు. త్వరలో జవహర్లాల్ నెహ్రూ, రవీంద్రనాథ్ టాగూర్ విగ్రహాలు కూడా మాస్కోలో స్థాపించనున్నారు. ఢిల్లీలోని నెహ్రూ పార్కులో లెనిన్ విగ్రహం ఇదివరకే స్థాపితమై ఉంది. వచ్చేఏడు పుష్కిన్, టాల్‌స్టాయ్, గోర్కీల ప్రతిమలను కూడా ఢిల్లీలో ప్రతిష్ఠించ నున్నారు. ఇంతేకాక, మాస్కోలో ఒక భారతీయ పాఠశాల ఇదివరకే ప్రారంభ మైంది. ఇందులో 150 మంది భారతీయ, విదేశీ విద్యార్థులు చదువుకుంటున్నారు. సోవియట్ విద్యార్థులు కూడా హిందీ, యోగ, భారతీయ నృత్య, సంగీతాలను ఇక్కడ నేర్చుకో గలుగుతారు.

నలభైఏళ్ళ క్రితం ఆమాటకొస్తే ఇరవైఏళ్ళ క్రితం సైతం ఇలాంటివి అనూహ్యం. మన ఉభయదేశాల నాయకుల, ప్రజల, నూతన ఆలోచనా సరళే వీటికి బాటవేసింది. ఇది మన ఉభయదేశాలనూ ఇంత సన్నిహితం చేయగలిగింది. ఇందుకు ఉడతాభక్తితో నేను సైతం దోహదం చేయడమేగాక, మన మైత్రీ వృక్షం మూడుపువ్వులూ, ఆరుకాయలుగా వర్ధిల్లు తూండటం చూడగలిగినందుకు నేనెంతో అదృష్టవంతుణ్ణని భావిస్తున్నాను.

(ఇంటర్నేషనల్ ఎఫైర్స్,
సంక్షిప్త పాఠం.)

# మానవ విలువలు



"దివ్వె ప్రకాశించేది అంధకారంలోనే" అన్న లియో టాల్‌స్టాయ్ నాటకం టెలివిజన్ అనుసరణను సుప్రసిద్ధనటుడూ, దర్శకుడూ, మిహాయిల్ కొజకోవ్ ఈ ఏడు టాల్‌స్టాయ్ 160వ జన్మదినోత్సవం సందర్భంగా రూపొందించారు. ఆయనతో ఇంటర్వ్యూ సంక్షిప్త పాఠాన్ని యిస్తున్నాం.

ప్రశ్న: అసలెందుకీ నాటకం? ఈనాడూ ఎందుకు?

**జవాబు:** ఆయన రాసిన అన్నిరచనలూ జ్ఞాపకమున్న సాహిత్య వేత్తలకూ, టాల్‌స్టాయ్ అభిమానులకూ ఈనాటకం తెలుసు. 1880ల ఆరంభంలోనే ఈనాటకం ఆయన మనసులో రూపుగొంది. అయినప్పటికీ 1896లో గానీ ఆయన దీన్ని రాయనారంభించ లేదు. ఈనాటక రచన ప్రారంభమై దాదాపు ఒక శతాబ్దం అవుతోంది. రచన టాల్‌స్టాయ్ అమరణాంతం కొనసాగింది.

దివ్వెను కాంచి, జీవిత అంధకారాన్ని పారద్రోలుతుందన్న ఆశతో దాన్ని ఆ అంధకారంలోకి తీసుకొని వచ్చిన వ్యక్తిని గురించి ఆలోచించానని ఆయన తన డైరీలలో రాశారు. అయితే, దానికి బదులది మరింత అంధకార బంధురమైపోయింది. ఈ నాటకమంత సంపూర్ణంగా ఆయన భావాలను మరొక నాటకం వ్యక్తం చేయదు. ఆయన దీన్ని "నా నాటకం" అన్నారు.

ఈ నాటకంలో రచయిత ఆత్మకథా లక్షణాలు, కుటుంబ, సామాజిక ఘర్షణలు, దేవుడూ, ఆస్తికత్వమూ, చర్చి, సామాజిక దురన్యాయమూ గురించిన ఆలోచనలు ఉన్నాయి. ఇందులోని ప్రధానపాత్ర సారిన్‌త్సేవ్ తన భార్యను, తన ఆత్మబంధువుగా చేసుకో యత్నించి విఫలుడవుతాడు. అందుకే కుటుంబాన్ని త్యజించడానికి అతని రెండు ప్రయత్నాలూను.

ఈ సాదృశ్యం స్పష్టమే. అయినప్పటికీ, టాల్‌స్టాయ్‌పై నాటకాన్ని ప్రదర్శించాలని కానీ, సినిమా తీయాలని కానీ నేను కలలో కూడా అనుకోను. నాటకంలో ఒక మహా మేధావి పాత్ర నిర్వహించడం అసాధ్యమని నానమ్మకం కాని ఆయన (టాల్‌స్టాయ్) గాక, టాల్‌స్టాయ్ అభిప్రాయాలను ఆచరణలోపెట్టే ప్రధానపాత్రగా వున్న వ్యక్తి నాటకాన్ని ప్రదర్శించడం సాధ్యమే.

విప్లవాత్మక సంస్కరణలు జరుగుతున్న కాలంలో నాదృష్టి ఈనాటకం వైపు ఎందుకు మళ్ళింది? ప్రామాణిక గ్రంథాల ప్రత్యక్ష ప్రచారాత్మక అనుసరణలకు అలవాటుపడిపోయిన వారికి ఈనాటి ప్రశ్నలకు నా టాల్‌స్టాయ్ అనుసరణలో సమాధానం లభించదు.

# బాధాతప్త అనుభవంతో సత్యసాధన

జీవితం, మరణాలను గురించీ; మతమూ, దేవుడిని గురించీ నా ఆలోచనలకు, ఈనాటకంలోని మనః స్థితికీ సాదృశ్యత ఉండటం వల్ల దీన్ని ప్రదర్శించాలని మొదట నాకు 18 నెలల క్రితం ఆలోచన కలిగింది. అంతరాత్మ మనలోని దేవుడని ఆయన అన్నారు. అంతరాత్మ ప్రకారం జీవించడమంటే ఏమిటి? చుట్టూ అన్యాయం, అవమానం, పేదరికాలు తాండవిస్తుంటే ప్రశాంతంగా జీవించగలమా?

జనంమధ్య సంబంధాల లేమి ఈనాటక భావాల్లో ఒకటి. జనం, ఒకరికొకరు దగ్గరవుతున్నారు గానీ, పరస్పరం అర్థం చేసుకోవడం లేదు. ఒకరిమాట ఒకరు వింటున్నారుగానీ, మనసుపెట్టి వినడంలేదు. ఈనాటకం పూర్తికాలేదన్న మాట మీరు గుర్తు పెట్టుకోవాలి. ఈ నాటకం చివర్లో ప్రధానపాత్ర ఎలా బతకాలో తెలియక దేవుని అస్థిత్వం పట్ల సందేహాన్ని ఆయన్నుద్దేశించే వ్యక్తపరుస్తుంది. ఇది అంతంలేని కథ.

టాల్‌స్టాయ్ జీవితంతో ఉన్న సాదృశ్యం నాకు కొన్ని ఇబ్బందులను కలిగించింది. మొదటిది, స్క్రిప్టు రాయడానికి, నాటకంపై నోట్సునూ దాని అనుసరణలనూ విశ్లేషించాల్సి రావడం రెండవది, నటుల ఎంపిక.

ఈనాటక ప్రదర్శనకు కాలం పరిపక్వం చెందిందని నేను నమ్మడమే నేనీనాడు ప్రదర్శించబూనడానికి కారణం. 1917కు ముందు గానీ, తర్వాతగానీ యిది ప్రదర్శితం కాలేదు. 1930 ల నుంచీ 1970 లదాకా ప్రదర్శన

తలపెట్టడమే అసాధ్యంగా ఉండింది. టాల్‌స్టాయ్ విషయంలో ''తీవ్రమైన'' అన్న మాట వాడను. కానీ, ఈనాటకంలో అనేక సాహసోపేతమైన భావాలు, ఆధ్యాత్మిక తదితరాలకు సంబంధించిన అనేక తీవ్ర సమస్యల ప్రస్తావన ఉంది.

ప్రశ్న: ఈ నాటకంలో క్రైస్తవ మత పీఠం, మతం, ఆస్తికత్వాలకు సంబంధించిన సమస్యలుండటం గమనార్హం. అవునా?

జవాబు: అవును. 'కన్ఫెషన్' నూ,ఈనాటకాన్నీ ఏకకాలంలో రాశారు. ''కన్ఫెషన్'' తాత్విక, మత, నైతిక వ్యాసం. నాటకంలో ఈ విషయాలనే ఎంతో నాటకీయంగా చెప్పారు.

ఈ రెండు పుస్తకాల్లోనూ టాల్‌స్టాయ్ దేవుణ్ణి గురించి చెప్పారు: ప్రపంచానికి ప్రారంభం ఉంది; దేవుడున్నాడు; క్రీస్తు మహామేధావి; మనం ఆయన టెన్ కమాండ్‌మెంట్స్‌కు (ఆదేశ సూత్రాలు) అనుగుణంగా జీవితం గడపాలి. టాల్‌స్టాయ్ చర్చిని గుర్తించలేదు. అది ప్రజలను ఏకం చేయడానికి బదులు వేరు చేస్తుందని ఆయన నమ్మకం. దేవుడున్నాడనీ, ప్రపంచానికి ప్రారంభం ఉందనీ తాను చెబితే విశ్వాసులంతా అంగీక రిస్తారని ఆయన నమ్మరు.

ఒక దేవుడి నీడన ఏకం కమ్మని టాల్‌స్టాయ్ మనకు పిలుపివ్వగా, మతాలు మనల్ని విడదీస్తున్నాయి. వ్యక్తి పీడనను చర్చి సమర్థిస్తుందని తాను నమ్మడం వల్ల ఆయన చర్చిని వ్యతి రేకించారు.

టాల్‌స్టాయ్ లాంఛనప్రాయ సమానత్వాన్ని గాక సంపూర్ణ సమానత్వాన్ని గురించి కలలు గన్నారు. తాను అహింసను బోధించడం వల్ల టాల్‌స్టాయ్ విప్లవాన్ని అంగీకరించక పోయినప్పటికీ ఆయన భావాలు విప్ల వానికి బాట వేస్తూండటం యిందువల్లే, అని లెనిన్ రాశారు. ఇదిగుర్తుంచు కోవాలి.

ప్రశ్న: క్రీస్తు మానవాకారంలోని దేవుడు కాదు, కేవలం మానవుడని టాల్‌స్టాయ్ భావించారని మీరను కుంటున్నారా?

జవాబు: అవును. ఈనిర్ధారణకు రావడానికి ఆయన సుదీర్ఘ పథం గడచివచ్చారు. తన ప్రశాంతత కన్నా (ప్రశాంతత చూడండి!) ఆర్థొడాక్స్ మతాన్ని ప్రేమించే దశతో ప్రారంభించానని ఆయన ఒకప్పుడు రాశారు. తర్వాత ఆయన తన చర్చికన్నా క్రైస్తవ మతాన్ని ప్రేమించారు. ఆ తర్వాతగానీ ఆయన ప్రపంచంలో అన్నిటికన్నా సత్యాన్ని ప్రేమించే దశకు చేరుకోలేక పోయారు. క్రైస్తవ మతంగా తాను అర్థం చేసుకున్నదీ (ఆర్థొడాక్స్ చర్చి కాదు. క్రైస్తవ మతం ఒక భావన అన్న విషయం), సత్యమూ ఒకటేనని భావించారు. ఈ విషయం చాలా ముఖ్యం. ఎందువల్లనంటే, ఆయనను చర్చినుండీ వెలివెయ్యడానికి కారణమదే.

ఇటీవలే, చలనచిత్ర నిర్మాతల భవనంలో, మాస్కో పేట్రియార్కేట్ ప్రతినిధులతో ఒక సమావేశం జరిగింది. టాల్‌స్టాయ్‌ని వెలి వెయ్యటం పొరపాటు కాబట్టి, చర్చి ఆయనపై వెలిని రద్దు చేయాలని ఒకరు సూచించారు. ఒక ఆర్థొడాక్స్ చర్చి సిద్ధాంతవేత్త తెలివిగా యీలా జవాబిచ్చారు: ''లేవ్ నికొలయేవిచ్ దీన్ని కోరుతున్నారని మీరు నమ్ము తున్నారా?'' ఆయన సరిగ్గా చెప్పారను కొంటాను.

ప్రశ్న: క్రీస్తు ఒకవిశ్వాసానికి ప్రతీక అనీ,ఒక భావం కోసం, సత్యం కోసం బాధలను ఆహ్వానించిన మనిషి. అనీ టాల్‌స్టాయ్ అభిప్రాయమని మీరు చెప్పేదాని అర్థమా?

జవాబు: అనివేరే చెప్పనవసరం లేదు. బాధలను భరించడమే సత్యసాధనకు మార్గం అని టాల్‌స్టాయ్ చెప్పారు.

ప్రశ్న: నేడిది చాలా ముఖ్యం. అవునా?

జవాబు: నీతీ, అంతరాత్మలే దేవుడని టాల్‌స్టాయ్ అభిప్రాయం. పాదార్థిక సమృద్ధి గాక ఆత్మిక సామరస్యంగల భూతలస్వర్గాన్ని గురించి ఆయన కలలుగన్నారు. ఈ భావాల, ఆలోచనల, సమస్యల యావత్తు సముదాయం, కాలక్షేపానికిగాక, మెదడుకు మేత కోసం నాటకశాలలకు వచ్చే వారికి ఎంతో ముఖ్యమన్న నమ్మకం నాకుంది. అలాంటి వారికి నేనీ నాటకాన్నిప్రదర్శించాను.

పురావస్తుశాస్త్రం

# సంచలనాత్మక ప్రాచీన వస్తునిధి పెంజికెంత్

డాక్టర్ బి. మార్షాక్ (చరిత్ర)
వి. రస్పపోవ, క్యాండిడేట్ ఆఫ్ హిస్టరీ

ఇటీవలిదాకా మధ్య ఆసియాలో శాస్త్రపరమైన ఆసక్తి అక్కడి ముస్లిందశకు మాత్రమే పరిమితమైవుండేది. యీదశ అరబ్‌దండయాత్రలతో ప్రారంభమైంది. అయితే, యీ ప్రాంతంలో మరింత ప్రాచీన, అభివృద్ధి చెందిన సంస్కృతి వుండేదనీ, దీనికి యితర ప్రాంతాల సంస్కృతులతో సంబంధం వుండేదనీ భారీస్థాయి తవ్వకాలు రుజువుచేశాయి. పెంజికేంత్ ప్రదేశం ప్రత్యేకించి మధ్యఆసియాలో చారిత్రక అధ్యయనాల పరిధిని అపారంగా పెంచింది.

సోగ్ద ప్రాంతం మధ్యఆసియా నడిబొడ్డున వుంది. దీనికి రాజదాని అప్పట్లో సమర్ఖండ్; అలెగ్జాండర్ దిగ్రేట్ కాలంనాటి నుంచీ యీ ప్రాంతం కళలకు, హస్తకళలకు ప్రపంచ ప్రఖ్యాతి గాంచింది. ప్రాచ్య పర్షియన్ భాషమాట్లాడే సోగ్దియన్‌లు ఒక నరవర్గ బృందానికి చెందినవారు. వాళ్ళు సోగ్దకు బయట బిజాంతియన్ సరిహద్దునుంచి చైనాదాకా గ్రేట్‌సిల్క్‌రూట్ వెంట అంతటా జీవనం గడిపారు. సింధూలోయ యెగువ భాగాన వాణిజ్య మార్గాలవెంట అనేక సొగ్దియన్ శిలాశాసనాలు లభించాయి. సొగ్దియన్ లిఖితపత్రాలు చైనా పశ్చిమప్రాంతంలో దొరికాయి.

అనాదికాలంనుంచీ ప్రసిద్ధికెక్కిన సొగ్దియన్ సంస్కృతి మధ్యయుగాల ప్రారంభంలో శిఖరస్థాయిని చేరుకుంది. క్రీ.శ. 6-8 శతాబ్దాలకాలంలో సొగ్దియన్‌లు ఒకవైపు చైనా, యూరప్‌ల మధ్యా, వుత్తరాది ఊరల్స్‌కు చెందిన వేటాడేతెగల మధ్యా, మరోవైపు పర్షియా, బిజాంతియుంలకూ మధ్య వర్తులుగా వ్యవహరించేవారు. స్టెప్పీభూములకు శక్తివంతమైన పరిపాలకులుగా వుండిన టర్కీఖాన్‌లు సిద్ధహస్తులైన సొగ్దియన్ దౌత్యవ్యవహర్తలను, రాజకీయ సలహాదార్లను విస్తృతంగా నియమించారు. సొగ్దిన్ కూలిసిపాయిలు విదేశాల్లోని అనేకమంది రాజుల సైన్యాల్లో ప్రబలంగావుండేవారు. సోగ్దియన్లు నలుమూలలకూ సంచారం చేశారు; ఆనాటి అగ్రగామి నాగరికతలు సాధించిన విజయాలు వాళ్ళకు తెలుసు కానీ, వాళ్ళు శక్తివంతమైన తమ సొంతఐక్యరాజ్యాన్ని యెప్పుడూ నెలకొల్పుకోలేదు; మరుగుజ్జు ధృవ ప్రాంతీయలతో సర్దుబాటు చేసుకుని జీవించారు. అలాంటి నగరరాజ్యాల్లో పెంజికేంత్ ఒకటి.

1948 లో సోవియట్ యూనియన్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ ఆధ్వర్యానగల లెనిన్‌గ్రాడ్ శాఖకు చెందిన పురావస్తు శాస్త్ర యిన్‌స్టిట్యూట్, తజిక్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ ఆధ్వర్యానగల చరిత్ర యిన్‌స్టిట్యూట్, ప్రభుత్వ హెర్మిటేజ్ మ్యూజియంలు సంయుక్తంగా పెంజికేంత్ పురావస్తు అన్వేషణ సాగించాయి. యివి యేటా ఆ ప్రదేశంలో తవ్వకాలు



హాలును పునర్నిర్మిస్తున్నారు. దక్షిణాది భాగం దృశ్యం. ఉత్తరపు గోడపై : పైన, నానా తలుపుపై బుద్ధుడు. పక్క గోడలమీద రాజు విందు దృశ్యాలు

జరుపుతాయి. తవ్వకాల్లో బయటపడ్డ ఆలయాల్లో, ప్రాసాదాల్లో, గృహాల్లో నిత్యశోభాయమాన మైన రంగురంగుల కుడ్యచిత్రాలు కనిపించాయి. యివి క్రీ.శ 5–8 శతాబ్దాలమధ్యకాలంనాటివి. పదిలంగా వున్నకొయ్య విగ్రహాలను కనుగొన్నారు. 722 లో అరబ్ దండయాత్రికులు నగరాన్ని అగ్నికి ఆహుతి చేసినప్పటికీ యీ విగ్రహాలు చెక్కుచెదర కుండా మిగిలిపోయాయి.

**40** యేళ్ళుగా సాగుతున్న తవ్వకాలవల్ల **8** వ శతాబ్దంలో యీ నగరం గురించి అనేక విషయాలు తెలిశాయి. కోటను, దాని పాలకుల ప్రాసాదాన్ని కనుగొనేందుకు యీ ప్రదేశంలో దాదాపు నగ భాగాన్ని అధ్యయనం చేయడం జరిగింది; పెద్ద ఆవరణలతో రెండు మందిరాలను, **8** పెద్ద వీధు లను, **10** సందులను, కోటగోడలను, అనేక బజార్లను, వ్యాపారుల, చేతివృత్తులవారి దుకాణాలను కనుగొనడం కూడా యీ అధ్యయన లక్ష్యం. చేతివృత్తుల వారివి మొదలుకుని సిరిసంపదల్లో రాజుకు సాటిరాగల కులీనులవి యెవరివైనప్పటికీ మేము పరిశీ లించిన మొత్తం **150** గృహాలు రెండుమూడంతస్తులవి; వాటిలో చాలా గదులున్నాయి. బలమైన, విశాల మైన నిర్మాణాన్నీ పచ్చి యిటుకలతో, ఆశ్చర్యం గొల్పేంత ఆదిమ వస్తుసామగ్రితో కట్టినవి. తగుమాత్రం ఆదాయంగల ప్రజలుకూడా తమ యిళ్ళను కుడ్య చిత్రాలతో, కొయ్యవిగ్రహాలతో అలంకరించుకున్నారు.

**8** వ శతాబ్దంలో తొలిపాతికేళ్ళనాటి ఒక డ్రాయింగ్ రూం అధ్యయనం **1986** లో ముగి సింది. దాన్ని **28** వ గదిగా పేర్కొన్నారు. ఆయింటి యజమాని పేరు మనకు తెలీదు. యింటి యజమానులు ప్రార్థన చేస్తున్న దృశ్యాలు తరచుగా కుడ్యచిత్రాల్లో కనిపిస్తాయి. కానీ యిక్కడ అలాకాదు. కాగా, **13** శతాబ్దాల క్రితం జీవించిన ఆ యింటియజమానికి యెదురైన సమస్యల చిత్రణ ఆ కుడ్యచిత్రాల్లో కనిపిస్తుంది.

ఆ యింట్లోకి ప్రవేశించగానే అర్థగోళాకారపు గదిలోని దక్షిణంవైపు గోడకనిపిస్తుంది. ప్రకాశ వంతంగా వున్న ఆగది మధ్యభాగంలో, దాని వెనకేవున్న ఆర్చీమీదా ఉత్కృష్టమైన కుడ్యచిత్రాలున్నాయి.

సాధారణంగా పెద్దచిత్రాల విషయంలో జరిగే విధంగానే ఆ కుడ్యచిత్రం కూడా జీర్ణావస్థలో మాకు లభించింది. అందులో, ఆసీనులైవున్న దేవతల నడుములు, మోకాళ్ళున్న భాగం సన్న పీలికగా మిగిలివుంది. పెంజికేంత్‌లోని యితర గృహాల్లో పుష్కలంగా కనిపించే, అలాంటివే దేవతా మూర్తుల చిన్నచిన్న చిత్రాలనుబట్టి ఆ యింటికప్పు యెలా వుంటుందో మేము నిర్ణయించాం. వుదా హరణకు, అక్కడ నల్లరంగుమరకలు అనేకం వున్నాయి. బహుశా అవి ఒక మనిషి చిత్రావశేషాలు

గొర్రెతల ఆకారంలో ప్రాచీన పానపాత్ర      డాక్యుమెంట్లతో ఉద్యోగి



అయివుండొచ్చు. ఒక నల్లమరక పరిమాణాన్ని, స్థూలరేఖలను, చిత్రంలో దాని స్థానాన్ని పరిశీలించినమీదట అది దేవతలను ప్రార్థిస్తున్న ఆ యింటి యజమాని శిరస్సు గానీ, యింట్లో యెవరో ఒకరి శిరస్సుగానీ అయివుంటుందని మేము వూహించగలిగాం. కొన్ని రేఖల చారలనుచూసి జంతువు ఆకారంగల సింహాసనంకాళ్ళను గుర్తించగలిగాం; ఒకకాలి మీద కొండపొట్టేలు చెవి, కొమ్ము మాత్రమే మిగిలివున్నాయి. అలాంటివే యితర కుడ్యచిత్రాల మీద ఒంటె ఆకారంలో యింకా తక్కువగా చిహ్నాలు వున్నాయి: ఒకటి రెండు కేశపుకుచ్చులు, ఒక గంట మాత్రం. అవశేషాల పీలికలను జతచేయడానికి సహజంగానే ఒక చిత్రయాపోహ్యం ఖ్ళ్ళ సృష్టించడం మా కర్తవ్యం. మేము అనేక విధాలుగా పరిశీలించాం. కానీ ఒంటె మాత్రమే మా అవసరాల న్నిటికీ సరిపోయింది

ఒంటె, ఒంటె మీదున్న సింహాసనం దేవుళ్ళలో ఒకరికి ప్రతీక. యీ దేవుడు కత్తి పట్టుకుని కూచుని వుంటాడు. కొండపొట్టేలు, పొట్టేలు మీద సింహాసనం మరొక దేవతకు చిహ్నం.

ఆవ్యేస్త అభిప్రాయం ప్రకారం, వెరెత్రాగ్నా మూర్తిత్వానికి, అంటే పర్షియన్ల విజయాధిదేవతకు ప్రతీకల్లో ఒంటె ఒకటి: యిది సొగ్దలో వాషగ్నగా, పాగన్ ఆర్మీనియాలో వాహగ్నగా పేరు గాంచింది. మానవాకృతిగల జంతువులు దేవతలు మత సంబంధమైన కళలో వున్నాయి: యివి ఆదిమతెగలకు వంశపారంపర్యమైన దేవుళ్ళ అనవాళ్ళు యే విధంగా చూసినా ఒంటె దేవత అనంతరం ఒంటె మీది సింహాసనం మీద కూచున్న దేవత అవతరించింది. వెరిటాగ్ వత్స దేవతగా . వున్నట్టు కనిపించలేదు; కానీ యిది సర్వ దేవతారాధన తత్వంలో వనాంత్. నక్షత్ర విజయాధిదేవతగా వుంది యీ దేవతకూ, దక్షిణ సొగ్దకు చెందిన రాజ్యమైన ఐక్షేయలోని హైనిండాలో ఆరాధిస్తుండిన దేవతకూ సాదృశం వుండివుండొచ్చు.

పౌరాణికగాధలు తరచుగా నక్షత్రాలను విజయ, వరుణ అధిదేవతలుగా పరిగణించాయి. ఆ చిత్రంలో, అర్థనగ్నంగా నీటితొత్తిని మోసుకెళ్తున్నట్టు సింహాసన పీఠభాగాన గల చిన్న చిత్రం సూచిస్తున్నట్టుగా అది వరుణదేవునికి. వరుణదేవికి కూడా ప్రాతినిధ్యం వహించే సొగ్దియన్ దేవతలు.

కావిరంగు దుస్తులు ధరించిన బౌద్ధసన్యాసిది మరోబొమ్మ ఆర్చికింద చిత్రించి వుంది. అతని భుజాలు మీద అగ్నిజ్వాలలున్నాయి; కుడిభుజం

పంటకోతల దేవత శిరోభాగం

మీటర్ కొలబద్దతో మనిషి



అనాచ్ఛాదితంగా వుంది. శిరస్సు చుట్టూ తేజోమండలం కనిపిస్తుంది; గడ్డంలేని అతని ముఖం గుండ్రంగా, చెవులు పొడవుగా, గొంతుకు రెండు ముడుతలూవున్నాయి. కళ్లు, నుదురు, శిరోభాగం పూర్తిగా ధ్వంసమైపోయి నప్పటికీ అది బుద్ధుడేనని గుర్తించడానికి తగినన్ని ఆధారాలున్నాయి. కానీ చేతులు వుంచిన తీరు బౌద్ధసంప్రదాయానికి అనుగుణంగా లేదు: కుడి అరచేతికి బదులు యెడమ చేయి మనవైపు చూపుతున్నట్టుగా వుంది; బొటనవేలు పక్కకు తిరిగి సరైన రీతిలో లేదు.

అతని యెడంవైపున తామర పువ్వు పట్టుకున్న ఒక ఆకారం నిల్చునివుంది. లలితంగా, స్త్రీలాగా రూపురేఖలు . కనిపిస్తున్నప్పటికీ దాని గులాబి ఛాయను బట్టి, భారతదేశంలోని పురుషులు ధరించే టువంటి నగలను బట్టి అది పురుషాకారమని మనకు అర్థమౌతుంది. కుడివైపునున్న తామరపుష్ప గుచ్ఛం, పైకి యెగుస్తున్న స్వర్ణపర్ణాకృతీ బౌద్ధమత నియమాన్ని వ్యతిరేకిస్తున్నాయి; అవి బుద్ధునికి యిరువైపులా యిద్దరు బోధిసత్త్వులతో కనిపించే సాంప్రదాయిక మూర్తి త్రయాన్ని ఆ కుడ్యచిత్రం ప్రతిబింబిస్తోందనే వూహను ఖండిస్తున్నాయి.

ఏదేమైనా, ఆ కుడ్యచిత్రంలోనిది బౌద్ధమతభావనే అనడంలో సందేహంలేదు. పెంజికేంత్‌లో యిలాంటిది ఒకే ఒకటి వుంది కానీ దీనికీ, 8వ శతాబ్దంనాటి తక్కిన బౌద్ధమతానికి చెందిన స్థానిక కృతులకూ సారూప్యత యెంతోవుంది: .తేజోవలయం, అగ్నిజ్వాలలు, పువ్వులు, వస్త్రాలు. దాన్ని చిత్రించిన కళాకారుడుగానీ, యజమానిగానీ బౌద్ధులుకాదనే విషయం స్పష్టమే యజమాని తన యింట్లోని దక్షిణపు గోడమీద చిత్రించిన దేవతలను, సింహ వాహనంగల నానాను ఆరాధించేవాడు బుద్ధుడు అతని అంతరాళాల్లో యెక్కడో వుండేవాడు. కానీ, బౌద్ధ ఆరాధనా చిత్ర పటాల విషయంలో మంచి పరిజ్ఞానం అతనికిగానీ, అతను యెంచుకున్న చిత్రకారునికిగానీ లేకపోయి నప్పటికీ, అతను బుద్ధుణ్ణి విశ్వసించాడు.

విశాలమైన డ్రాయింగ్ రూం మేము వెలికి తీస్తున్న నాగరికతకు చక్కటి తార్కాణం. కుడ్యచిత్రాలన్నిటినీ పునస్సృష్టి చేసేందుకు, లేదా వివరించేందుకు ఆ నాగరికత గురించి మాకింకా అంతబాగా తెలీదు. కానీ, మేము తెలుసుకున్న కొద్ది వివరాలను బట్టి ఆ యింటి యజమాని, చిత్రకారుని మనస్సుల్లో ప్రపంచాన్నిగురించి అత్యంతనాగరికమైన మనోభావచిత్రం వుండేదని చెప్పగలం.



వి. వ్లాదిన్

నా వయోజీవితం అంతానేను ఏదో ఒక విషయం గురించి గర్విస్తూనే వున్నా. ప్రపంచంలో అన్నిటికన్నా **అతిపెద్ద** వాటిని, యూరప్‌లోనే **అతిపెద్దవాటిని**, దేశంలోనే **అతిపెద్ద** వాటిని, మండలం లోనే **అతిపెద్ద** వాటిని నిరంతరం మనం ఉత్పత్తి చేస్తూనే వున్నాం. **అత్యద్భుతమైన, కనీవినీ ఎరుగని, ఊహక్కు కూడా అందని** ఏవేవో ఉత్పత్తి చేసే స్తూనే వున్నాం.

ఆహారం, నీరు, ఆవాసం, ఆస్పత్రులు లేదా కిండరగార్టెన్‌లు అలాటి సౌకర్యాలేమీ వారికి లేని స్థితిలో వారు పని చేస్తారు; ఎముకలు కొరికే చలిలో మంచు వర్షాల్లోనే శయనిస్తారు. మర్నాడు ఉదయం లేవగలిగిన వాళ్లు కదంతొక్కుతూ సాగుతారు. ఆ తరవాత మహాబ్రహ్మాండమైన ప్రాజక్టు అద్భుత ప్రారంభోత్సవం జరుగుతుంది

ఇక్కడ ప్రతిభా విశేషాల పరిమాణం కూడా వూహాతీతమైనది. ప్రపంచంలోని మొత్తం పెనులన్నిటికి బూట్లు అమర్చ గల వడ్రంగి పనివారున్నారు; ధాన్యంగింజ మీద, రచయితల సంఘం డైరక్టరీలో లేక అగ్ని ప్రమాదమాపక భద్రత సూత్రాలలో చెక్కగలిగినవారు మరెక్కడవుండగలరు? ఏడేళ్ళ కుర్రవాడు యిప్పటికే సంస్కృతం క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. ఆరేళ్ళప్పుడు బాచ్ సంగీతం వాయించగలిగాడు. మూడేళ్ళకే గడ్డం గీసుకోడం ప్రారంభించాడు.

సాహసకృత్యాలకు అంతూ పొంతూ లేనేలేదాయె. ఒక మామూలు అగ్నిమాపక భటుడు ఒక బ్రహ్మాండమైన పియానోను పొగలోంచి బయటకు మోసుకొచ్చి నీటిలోకి దూకి ఒడ్డుకి యీదుకొచ్చాడు. ఆ తరవాత వూరువూరంతా తమచర్మాలను, అవి డప్పులు మోగించినవే అయితేనేం, ఆ సాహస భటుడికి దానం చేసింది. ఆత్మ త్యాగానికి ఈ వుదాహరణ చాలదా?

అంతేనా పామీర్ పర్వత పాదపీఠం దగ్గిర ఒకస్థానిక పశువుల కాపరి నలభై ఆడగొర్రెల నుంచి ఎనభై గుర్రప్పిల్లలను పొందగలిగాడు. కాగితం విషయంలో మనకు కొంచెం కష్టం అవుతున్నమాట వాస్తవమే. కాని ఎవరూ ఎప్పుడూ ఎక్కడా కట్టనంతగా అతి పెద్ద కాగితం గుజ్జు కాగితం మిల్లును మనం నిర్మిస్తున్నాం. అతిపెద్ద స్వచ్ఛజల సరస్సుని కలుషితం చేస్తున్నాం.

మన వీర అదెట్లంటే నాకెంతో గర్వం. ఒక ఫుట్‌బాల్ ఆటగాడు కాలర్‌బోను విరిగినప్పటికీ, ఒక బాస్కెట్ బాల్ ఆటగాడు అతి సీరియస్‌గా గాయపడినా – ఎంత అద్భుతంగా ఆడాడూ అంటే ఆ తరవాత అనేక సంవత్సరాల పాటు యిక ఆడకుండా వుండిపోయాడు.

ఓ చెవీ, ముక్కూ, గొంతు డాక్టరును అర్ధరాత్రి నిద్రలేపి చుక్‌చీ ద్వీప సముదాయంలోని ఒక మారుమూల పల్లెకు వెళ్ళాల్సిందని చెప్పారు; ఆ డాక్టరుకు బాగ జ్వరంగా వుంది. మరేంచేస్తాడు గనక. బ్రిటనూ, ఫ్రాన్సూ బెనెలూ దేశాలు మూడూ కలిసినంతటి విస్తీర్ణంగల భూభాగానికి యీ ప్రాణి ఒక్కడే డాక్టరాయె.

ఒక వంటవాడు అతిసారంతో బాధపడుతున్నప్పటికీ పనిలోకి యధావిధిగా వచ్చేస్తాడు. మరెలా? శ్రామికునికి భోజనం పెట్టవద్దా? పైగా అతడి స్థానంలో వుండి పనిచేయడానికి వేరే ఎవరూ లేరు మరి.

నిజం చెప్పాలంటే ఎవరైనా జబ్బు పడ్డప్పుడు వారి పని భారాన్ని యితరులు తమభుజాలకెత్తుకున్న సందర్భాలు లేకపోలేదు. హిస్టరీ మాస్టారు జబ్బుపడితే ఆ స్థానాన్ని భర్తీచేసి పాఠాలు చెప్పడానికి ఒక డ్రిల్లుమాస్టారు వచ్చారు. రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లలో విఖ్యాతశాస్త్రజ్ఞులైన డైరెక్టర్లు స్థానంలో వారికి బదులు లేబరేటరీ అసిస్టెంట్లు వచ్చి ఆపని చేస్తుంటారు.

ఒక్కొక్కపుడు సమిష్టిక్షేత్ర రైతుల స్థానంలో వారి బదులు ప్రొఫెసర్లు వస్తుంటారు లేదా వీరికి బదులు వారొస్తుంటారు.

ఇక సంస్కృతీ రంగ విజయాలు నిజంగా మహాద్భు

తాలు. మెట్రోలో అత్యధికంగా చదివే దేశం మనది. మెట్రోలోనే కాదు యితర రవాణా సాధనాల్లో కూడా చదవడం అత్యధికంగా వున్నది మన దేశమే. కేవలం నగరరవాణా సాధనాల్లోనే కాదు పనిలో వున్నప్పుడు కూడా అత్యధికంగా చదివేదేశం యిది.

అత్యద్భుత మైన ధాన్య పంటల దిగుబడి మనదేశానికే వుంది. అంతేకాదు ఎన్నడూ కనీవినీ ఎరుగని (ప్రపంచంలో ఎక్కడైనా సరే) స్థాయిలో ధాన్యాగారాల కొరతవున్న దేశం మనదే.

నా మిత్రుడొకడు పారిస్ వెళ్ళాడు. అక్కడాయన "ఆధునిక కళ" అనే ఒకపుస్తకం చూశాడు.

ధూళితో నిండిన ఆపుస్తకం అట్టమీద యీ వాక్యాలు వున్నాయి:

కవిత్వం: మయకొవస్కీ, వెన్నికవ్ నుంచి.....

థియేటర్: మెయెర్‌హోల్డ్ నుంచి......

పెయింటింగ్: మాలెవిచ్, కందిన్‌స్కీ నుంచి......

సంగీతం: ప్రొకొఫియేవ్, షొస్తకొవిచ్ నుంచి.....

ప్రతి విషయంలోనూ "నుంచి" అని చెప్పడానికి పేర్కొన్నవన్నీ మనమే. అయితే చివర్లో "వరకు" అని చెప్పేందుకు పేర్కొనేవి మాత్రం మనవి కావు. వాటికోసం మనమెంత మాత్రం లెక్కచేయం ఎందుకంటే యీ "వరకు" లు మనకు మనదేశంలో దొరుకుతున్నాయి. అదేమనకు యిప్పుడు ఎంతో గర్వదాయకం.

అనగూడనిదేమైనా నేను అనివుంటే - సారీ!

**("లితరతూర్నయారసీయ" నుంచి)**

## ధరలు - ఆర్థికవ్యవస్థ




పైకిపోతాం. త్వరలోనే తేలతాం.



డాక్టరు పిలిచాడు. ఆరోగ్య కారణాలవల్ల రిటైరయ్యావన్నాడు.

చిత్రాలు: వి. ఆర్సెనియేవ్



ప్రకృతి కళ

మగదన్ మండలంలో
పాక్షికదారు శిల్పతుంద్రా
చుక్ బీ ప్రాంతం (రష్యా ఉత్తరభాగం)
పైన: స్థానిక కళాకార్లు రూపొందించిన
దంతపు వస్తువులు

Regd. No. M. 8268



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M280 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |